వ. ఇట్లు తార్చి. 39

తే. క్రొవ్వి కలహించుతఱి మ్మెదకొదదుకదుపు
[1]రాయిడిని గడుదళముగా రాలినట్టి
ప్రసవదళములు వఱవనిపఱపు లగుచు
నెసఁగ నిం పొందునాపొదరింటిలోన. 40

సీ. బెరు కెఱుంగనిగాఢపరిరంభముల నల్లి
బిల్లిగొంచుఁ బెనంగుపెనఁకువలను
బెరిఁ గెడిపేరాసపేర్మి ననర్గళ
లీలఁ బర్వెడుకుచాస్ఫాలనముల
నడ్డమాఁకలు లేక యబ్బినయట్లెల్ల
నమరించునఖరరేఖాంకములను
గొదగొన్నతమిఁ గొంకు గొసరు లే కొనరించు
వివిధదంతక్షతవిభ్రమముల

తే. మన్మథావేశవిలసనమహిమ నెఱపు
తపసిఁ గని "సాదు రేఁగినఁ దల పొలాన
నిలువ దనుమాట నిజ మయ్యె నేఁ" డటంచు
మగువ నవ్వుచుఁ జేతకు మాఱు సేసె. 41

వ. ఆసమయంబున నటనున్న ద్వారకానగరంబునం గలకల
భాషిణిగానంబు వినుచున్నసిద్ధుండు తత్ప్రశంసాప్రసంగంబున
మణికంధరునిమాటఁ దడవుటయుఁ దలఁచుకొని యాచంచ
లాక్షి సిద్ధుని నభివీక్షించి. 42

తే. "అమరపతిపంపునను వచ్చినట్టిరంభ
కతన నే మయ్యెనో మణికంధరుని త

1. రాయఁడి.

పం బిఫుకు మీర లటు దృష్టిపఱపి చూడుఁ"
డనిన నొకకొంతతడ వతఁ డట్లచేసి(సె). 43

వ. ఇట్లు దివ్యదృష్టిం జూచి.

క. నగుచు "నీఁక నేమితపమో
మగువ సలుపుచున్న వాఁడు మణికంధరుఁ డా
మృగలోచనతో నదె యొక
చిగురుంబోదరింటిలోనఁ జిత్తజలీలల్." 44

వ. అనిన విని కలభాషిణి యమ్మణిస్తంభునిబోధమహిమకు వెఱఁ గందుచు ననేకప్రకారంబులఁ బ్రశంసించి "యో మహాత్మ! యొకటిరెండువ్రూటలు మాయింట నిలిచి యేము సేయుపరిచర్యఁ గైకొనవలయు." ననిన నతండు "గాన లోభంబున నీభవనంబునకు వచ్చుటింతియ కాని, మఱి వీరువారునుం బలెఁ బట్టణంబుల నెట్టుకొని యిట్టునట్టు మహిమలు పచరించువారము గాముఁ. కూఢప్రకారంబున నిలుపనోపుదేని నీయుపచారంబులు గైకొనియెద." నను టయు "నట్ల సేయుదు," నని తనగృహారామంబునంద నిలిపి యతిరహస్యంబుగా నాసిద్ధునకు నిష్టంబు లైనయన్నపానా దుల మోదం బొనర్చుచు నచ్చటికి నెవ్వారిం బోనీక తాన పరిచర్య సేయుచు రెండుమూఁడుదినంబులు హృదయంబు రంజిల్లఁ జేసి యంత నంతరంగంబున నలకూబరసంగమాభి లాష యతిశయిల్లఁ నతనిప్రియవనితయైనరంభ తెఱం గెఱుం గుటకుఁ గ్రమంబునఁ బ్రసంగంబు దిగిచి సిద్ధునితో నిట్లనియె.

తే. "అనఘ! మణికంధరుం డట్లు తనదుతపము
విఘ్న మొందించుకొనుటకు వెఱ పొడమెడుఁ;

దిరుగఁ దప మొనరింపంగ దొరఁకొనియె నొ;
యిపుడు రంభతో నున్నాడొ; యెఱుఁగవలయు." 46

క. అనుటయు నతఁ డమ్మునిదెసఁ
దనదృష్టి నిగుడ్చి నగుచుఁ "దరుణి యిఁకఁ దపం
బనుమాట గలదె! యిదె యా
ఘనుఁ డున్నాఁ డిపుడు రంభ[1]కౌఁగిట" ననియెన్. 47

ఆ. అనిన "వార లింక నచ్చోటు వాసి పో
యెదరొ యుందువారొ యెఱుఁగవలయు
మఱియుఁ జూచి చెప్పుఁడు మాటికిఁ దదభివీ
క్షణము వెలయ నేఁడు శంక విడిచి. 48

ఆ. అనుడు "లేవు నాకు నాశంక లెవ్వియు;
నెన్నిమార్లు చూడు మన్నఁ జూతుఁ;
బడఁతి "కలదె బాలిపతిమకుఁ జక్కిలి
గింత?" నాదుధృతికి గెంటు లేదు." 49

సీ. అని పల్కి మణికంధరునిదిక్కునందు దృ
ష్టి నిగుడ్చి యొక్కింత చెవియు నొగ్గి
యొకకేల మాట లాడక యుండఁ గలభాషి
ణికి సంజ్ఞ చేయుచు నిశ్చలత్వ
మున నొకించుకసేపు విని "యహార వారకా
మినులమే లిట్టిదె!" యనుచు నగిన
"నది యేమి యెఱిఁగింపు"మని యాలతాంగి త
న్నడయంబు నడుగ నిట్లనియె నతఁడు,

తే. "నీకు నే మని చెప్పుదు నీరజాక్షి!
యడఁచుకొనియెద నిన నవ్వడఁప రాదు!

1. కౌఁగిటిలోనను.

పరమసంయమిఁ దా నట్లు *బతము చెఱచి
మిగులఁ దుది రంభ చేసినతగవు వినుము. 50

క. కళ లంటి [1]కఱఁచి తనచె
య్యలఁ జొక్కెడుతపసిమది చివుక్కురు మనఁగా
"నలకూబర! విడు విడు రా
యలసితి"నని పల్కె మన్మథాతివివశతన్." 51

మ. అనిచెప్పన్ విని సిద్ధుఁజూచి "నగ నేలా యింత భవ్యాత్మ! యా
వనజాతేక్షణ యేమి సేయును? మహావాల్లభ్యసౌభాగ్యవ
ర్తన నర్థేశకుమారుఁ డంతరహితగాఁ దన్నేలుకోఁబోలు! నా
యన తానిత్తఱినట్టివల్లభకు దవ్వై యెందు నున్నాఁడొకో!

వ. అతనిఁ బరికించి చూడవలయు." ననుటయు సిద్ధుండు నవ్వుచు
"నీ కిదియ కదా ప్రధానప్రయోజనంబు" నని పల్కి, యిటు
నటు పరికించి చూచి యతఁ డున్నచోటు గని కలభాషిణి
కి ట్లనియె. 53

ఉ. "తా వెనువెంటఁ బాయక సదా చరియించినఁ దద్వినోదమో
దావృతిఁ జిక్కి రంభ తగినట్టితపోహాని సల్పలేదు; కో
పావహ మింద్రుబుద్ధి కరి; యట్లగుటం బ్రియుఁ గూడియట్టికా
ర్యావసరంబులందుఁ జనఁడాతఁడు; మానఁడు పెన్విరాలిచేన్.

క. కావున మణికంధరు నిత
పోవనముసమీపభాగమున నొక[2]వనిఁజూ
తావళిలో నున్నాఁ డదె
పూవులను జిగుళ్ల నొప్పుభూజముక్రిందన్." 55

వ. అని చెప్పి యి ట్లనియె. 56

---

* పరము. 1. కఱఁచి. 2. వనచూతావళిలో.

క. "తరుణీ! యిపు డాతనిపైఁ
బరాకుచే నీవు గానపాటవగుణముం
గరము మెఱయిం[1]ప వేనే
నరిగెద మఱి లేద యితర మగుపని యిచటన్. 57

తే. అంపితేఁ బోయి వచ్చెద." ననుటయుఁ గల
భాషిణి "మహాత్మ నిన్ను నాపాలిభాగ్య
దేవతగ నమ్మియుంటి; నాజీవితంబు
నేమిగాఁ జేసి పోయెద వెఱుఁగఁ జెపుమ." 58

చ. అనుటయు "నన్ను నిప్పుడనుసట్టిదియెయ్యది నాకుఁజెప్పుమా
వనిత! క్రమక్రమంబునను వచ్చినయట్టుల వత్తుఁ గాక!" నా
విని "బళి! లెస్సమాటయిది వేఱొకనాఁడిఁక మీరువచ్చి చే
ననుఁ గృపఁగాచుటల్?విను(డునామదిలోపలిచంద మేర్పడన్.

క. ఈవేళన యాతనికడ
కేవిధమున నైనఁ జేర్చు టింతియతక్కం
ద్రోవ మఱి లేదు నన్నుం
గావక క్షణభంగురములు కాంతలతాల్ముల్." 60

క. తదుపాయము దిద్దుటకుఁ
మది నెన్నఁ బ్రభావఘనులు మఱి లేరు మహా
భ్యుదయానుభావగుణసం
పదఁ బొదలినమీరుదక్కఁ బావనచరితా! 61

చ. అన విని సిద్ధుఁ డిట్లనియె "నంబుజలోచన! నిన్ను నేఁడ యా
యనకడఁ జేర్చునంతటియుపాయము నేర్చిన నేను డాఁతునే?

1. పలేవే.

యనుకొనరాదు గాకనినుఁ బ్రాణవిభుం దగఁ గూర్చిప్రోచియా
వెనుకటినీదుపాట వినువేడుక నెట్లగుచున్నవాఁడనో! 62

తే. చింత సేయుము నీవ యనంతశయన
పద్మనాభసమీపభూభాగవర్తి
యైనకొబ్బెరి యెక్కడ; యతని ద్వార
కాజనులు నేఁడ చేరు టెక్కడ లతాంగి! 63

క. మించుగ మాగురువులు శి
క్షించిన యీయెక్కిరింతసింగమునకు నూ
హించ నొక నాల్గుగడియల
సంచారము వలయు నతనిసన్నిధిఁ జేరన్. 64

వ. దీని కెంతవలసిన నేమి? యిది తడవం బని లేదు. నిన్ను దీనిపై నునిచికొనిపోయెద నంటినేని, యోపూఁబోఁడి! తోడిసిద్ధు లిది వేఱొక్కలాగుగా నెంతు; రెవ్వరి యంత స్సారం బెవ్వ రెఱుంగుదు? రదియునుం గాక, మీబోంట్ల సంస్పర్శమాత్రంబు నస్మదాదులకు సమ్మతింప నుచితంబు గాదు; మఱి వేఱొండుసామర్థ్యంబు లేదు. నాకుఁ గల దూరదృష్టి దూరశ్రవణ[1]శక్తి యిం దేమియు నుపకరింప దింక నీవు చెప్పిన ప్రకారంబు గావించెదఁ జెప్పు." మనుటయు నాసిద్ధునకుఁ గలభాషిణి యి ట్లనియె. 62

సీ. "ఓసిద్ధపురుష! మీ రేసరణిని గొని చన్న
నే మగుఁ? దక్కుశంక గలదె?
నీమహత్త్వముఁగాననిజడాత్ము లేమన్న
నేమి? కన్నమహాత్ము లించుకయును

1. శక్తు లిం దేమియు నుపకరింప వింక.

వేడ్కఁగలిగ భావింపర మముబోంట్ల
సంస్పర్శమాత్రంబు సమ్మతింప
నుచితంబుగాఁ దంటి రుచితంబె మఱి నాదు
ప్రాణహానికి నోర్చు టరసిచూడఁ?

తే. బలుపలుకు లేల? యింక నా చెలులు గిలులు
నేఁగుదెంచి విఘ్న మొనర్తురిత మెఱుఁగక
గావునం గొనిపొమ్ము శీఘ్రింబ నీదు
వెనుక నిడుకొని నన్ను మద్విభునికడకు." 66

సీ. అన నియ్యకొని సిద్ధుఁ డరు దైనపులితోలు
పల్లంబుతోడ నిబ్బరపుబిగిని
బొట్టుపట్టెడ గాఁగఁ గట్టినపెనుఁబాఁప
తట్టంబుతోడ వాదపుఁబసిండి
యంకవన్నెలతోడ సంకుపేరులతోడ
వశ్యౌషధపుఁదీగె వాగెతోడ
నేకపార్శ్వమున భల్లూకచర్మపుటొఱ
ఘటియించినట్టిబల్లత్తితోడ

తే. వఱలు నేనిదిండి వార్వమును దొలుతఁ
గాఁగఁ దానెక్కి "నన్ను దాఁకకయ దీని
కటివిభాగంబు నెక్కి రాఁగలవె యబల
వెనుక మరగొమ్ము నూఁతఁగాఁ గొనుచు!" ననియె. 67

క. అన విన "యీపాటిగ మీ
యనుగ్రహము గల్గి యుండ నక్కట యింక నేఁ

జనుదేక యేమి?" యని తన
కనువుగ హారి నతఁడు నిలుప నంగన యెక్కెన్. 68

తే. ఎక్కి "సిద్ధేశ యెవ్వరు నెఱుఁగకుండ
నెట్లు గొనిపోయెదో?" యన "నేల శంక?
యెందు నెద్దులు బండియు నేకమైనఁ
గొండమీఁదికిఁ బోవునో కొమ్మ" యనుచు. 69

క. నింగికి "ధే!" యని కదలిం
చెం గడు వడిగలుగుతనదుసింగముఁ బలుమా
ఱుం గలభాషిణిఁ దేటి క
నుంగొని "పదిలమ్ము సు"మ్మనుచు శీఘ్రగతిన్. 70

ఆ. మగులు గోడమీఁదఁ బ్రాఁకులు చిగురుజొం
పములు వానిమీఁదఁ బ్రచురదోహ
దములధూపములును దనకు మాటుగ గూఢ
గతిని గాంతఁ గొనుచు నతఁడు సనియె. 71

చ. చని చని యొక్కచో నతఁడు [1]చాలుగ నక్కజ మందుచుం
గనుం,గొనఁ దమమేఘరంజిఁ బొది గొన్న ఘనావళిలోననుండి
డా, రున నెదురైరి వైభవనిరూఢిఁ జెలంగెడుకొందఱుంగ
నల్, ఘనతరచాతురీమధురగానకళాకలనాకలాపలై. 72

క. తమపాటఁ జినుకుచినుకుల
దుముదుమగాఁ దడిసినట్టిదువ్వాలువలతో
గుమగుమ యనుపరిమళబృం
దముతో నప్పు డొకయింపొనర్చిరి వారల్. 73

1. చాలఁగ.

వ. ఇట్లింపొనర్చుచు నెదురైన నతండు వారిని సంభాషణ క్రమంబున రంభాసఖు లగుట యెఱింగి "యిది యేమి యనుంగునెచ్చెలి నచ్చట విడిచి వచ్చితి? రచ్చెలువ మణికంధరుమీఁది యనుగ్రహంబు వదలక యింకనుం గొన్నినాళ్లు తద్వనంబున నిలుచునో?" యనుటయును నగుచు వార లిట్లనిరి. 74

క. "ఎక్కడిమణికంధరుఁ? డతఁ
డెక్కడపోయెనొ యెఱుంగ? మిపుడు ముదముతో
నక్కొమ్మ పొదలుచున్నది
తక్కక నలకూబరుండుఁ దానుఁ రతులన్. 75

చ. ప్రియునిసమాగమోత్సవము పెంపున నింపలరారునామృగా
క్షి యిపుడు తద్వనిన్ రతివిశేషముసొంపులఁ జిక్కి యున్కి యా,
రయుచుఁ దదిష్టమున్ విడిచి రమ్మనఁ జాలక యాకెనుంచి యే,మ యరుగుచున్నవార" మని మానిను లచ్చటు వాసి పోవుచున్. 76

క. "వేళాకోళపుదీఁగలుఁ
బేలికలుఁ గళాసములును బీఱ[1]జడలుఁ దాఁ
దాలుచు నెట్లొకొ మింటన్
లీలావతిఁ దోల నింత నేర్పరి యయ్యెన్! 77

క. ఎక్కడ దొరకెనొకో యీ
చొక్కపుగుబ్బెత [2]బెడంగుజోగికి? నహహా
యిక్కలికి గుత్తగొనుఁ బో
తక్కక దివి నిమిషమున్న దైవతవిటులన్!." 78

1. జడలుచుం. 2. వెడంగు.

వ. అని చెప్పికొని రంత. 79

క. నలకూబరుండు రంభం
గలయుట విని చిన్నవోవు కలభాషిణిరీ
తులు దిరిగి చూచి "దీనిం
గలఁచెర యివ్వార్త తాపకరమై" యనుచున్. 80

ఉ. సిద్ధుఁడు నవ్వి "యోచెలువ చింతిలఁగా వల దిప్పు డెంత
యున్, బుద్ధిఁ దిరంబు గాఁగ ధృతిఁ బూను మొకించుక సేపు
లోన నే, శుద్ధముగాఁగ నీమనము శోకము సర్వముఁ
బుచ్చి వైచెదన్, సిద్ధము నాదుప" ల్కనియెఁ జెల్వయు
మోము వికాస మందఁగన్. 81

క. "ఏరీతి నింతమిక్కిలి
చేరికగా నాడి" తనియె సిద్ధుఁడు "చూడం
గారాదె కుడువఁ బోవుచుఁ
గూరలచవియడుగ నేల? కోమలి" యనియెన్. 82

క. కంఠీరవ మట్టియెడం
గంఠం బెగ నెత్తి చూచి కదలక నిలిచెం
గుంఠితగతియై యెందు న
కుంఠితగతి యనఁగఁ దొల్లి గుణము నెఱపియున్. 83

వ. అప్పుడు. 84

సీ. హుంకారములతోడ నుచ్చాటనపుబద
నికతీఁగతఱటునన్ వ్రేసి వ్రేసి
కడుడాక మీఱంగ మడమలు దాఁటించు
చును ముందటికి లివ చూపి చూపి

మొగము పార్శ్వములకు మగుడింపకుండ వా
కట్టుమూలికవాఁగెఁ బట్టి పట్టి
వడి నూర్ధ్వగతిని లేవకయుండఁ దననాగ
బెత్తాన మూర్ధంబు మొత్తి మొత్తి
తే. సిద్ధుఁ డధిక ప్రయత్న సన్నద్ధుఁ డగుచు
నెంత చేసిన నాసింహ మెదుటికడుగు
పెట్టదయ్యెను [1]గర్జావిభీషణముగఁ
దోఁకఁ ద్రిప్పుచుఁ గడువెన్కఁ ద్రొక్కఁగాని. 85

ఉ. అప్పుడు చాల సంక్షుభితయై పడజాతి "యిదేమి దేమయా
యిప్పుడు దీనిచంద?"మనియెం గలభాషిణి[2]మేచెమర్పఁగాఁ
గొప్ప విడంగఁ బాఱఁ జనుగుబ్బలఁ బయ్యెద వాయసుస్థితిం
దప్పి పిఱుంద పల్లటిలఁ దా మరగొ మ్మిరుగేలఁ బట్టుచున్.

వ. సిద్ధుండు నంతఁ దద్గమననిరోధకారణంబుం దలంచుకొని యా
చంచలాక్షితోడ. 87

క. "తరుణీ! వెఱవకు పల్లవు
మరగొ మ్మెముఱకు నాకు మర్యాదావి
స్మరణం బైనది మాటల
పరాకుచే" ననుచుఁ దనదుపారీంద్రంబున్. 88

వ. కొన్నియడుగులు దిరుగఁ బట్టి ధరణికి డిగఁ దోలుకొనివచ్చి
యచ్చట నచ్చెలువతోడ నశ్వరోహణంబు నేసి కేసరిని
మేఁతకు విడిచి 'యోపడఁతి యీమందరినికటంబునంద
మృగేంద్రవాహన యనుశక్తిగలదు. తన్మందిరంబు ముందఱ
నున్నమృగేంద్రంబునకుఁ గ్రిందమీఁదం జుట్టుపట్టున నెట్టిబెట్టి

1. గర్జాది. 2. మైచెమ.

దంపు సింగంబులుంజన వెఱచునిది మఱచియే నెంతతోలిన మనవాహనం బచటి[1]కట్టెదురునడచు; మనము నమ్మహాశక్తికి నభివందనంబు సేసి పోయినంగార్యసిద్ధియగు; రమ్మనుచు నల్లనఁ దనభల్లూకచర్మకోశంబుతోడిఖడ్గంబు పుచ్చికొని సింగపు[2]బల్లనముపోక యక్కడన యొక్కమఱుంగునడాఁచి యాచపలలోచనను మృగేంద్రవాహనగుడికిం దోడ్కొని చని తద్బాహ్యమంటపంబున నునిచి "యద్దేవిపూజకుఁ బువ్వులు దెచ్చెద" నని పూఁదోఁటకరిగె నప్పాడత్తెఱంగు గనుంగొని. 89

సీ. పసిమి పో నెండినకసవుబుట్టయుఁబోలె
నరవెండ్రుకలు పర్వుశిరమువలన
నలి గొన్న చెలఁదిపుర్వులనూలివల్లు నా
నమరెడు ముడుతకన్బొమలవలనఁ
గడుఁ జిట్లినట్టిబంగరుపూఁత పొక్కిళ్ల
వడువు సూపెడి మేనివళులవలనఁ
దునిసిప్రే లెడుప్రాఁకుతునుకలఁ దలపించు
బొమ్మఁవత్తో జలంబనమువలన

తే. ఘూకరవములచాడ్పున ఘోరవృత్తిఁ
దనరు ఘనకాసకుహికుహిధ్వనులవలనఁ
భావజుఁడు వెళ్లిపోయినపాడుమేడ
పగిదిఁ గాన్పించు ముదుసలి పడఁతియొకతె. 90

క. కలభాషిణిఁ జేరఁగ వ
చ్చి "లతాంగి! యెచటనుండి చేరితి వకటా

1. కట్టెదిరి నడచు. 2. బల్లంపుసంజోకలతోడనయొకమఱుం.

కలుషపుభావురుఁ బిల్లిని
జిలుకయుఁబలె నిద్దురాత్తు సిద్ధుం డనుచున్. 91

ఉ. ఎంతయు వింతచెల్వమున నివ్వన మెల్ల నలంకరించుచుం
గాంతత నొప్పు మేనిపసఁ గన్నులపండువు సేయు నిన్ను న
ల్లంతన చూచి "దైవ మకటా దొరకించెనె యిట్టినిగ్గయ
స్వాంతునిచేతి కీభువనసారము" నంచుఁ గడుం గలంగితిన్.

క. ఆకలుషాత్ముఁడు క్రమ్మతి
రాకమునుపె తొలఁగి పోవరాదే యెట కే
నోకూన యీమనోజ్ఞత
రాకృతి యేఁ జూడఁ జాల నసిపాల్ గాఁగన్! 93

తే. అమ్మ విను మింక నొకయించుకంతతడవు
నీతెరువుఁ జూడ నీపేరు నీతెఱంగు
నడిగి పరికింప మది యున్న దైనవాఁడు
రాకమును నీవు తొలఁగుట నాకుఁ బ్రియము. 94

శా. నీ కెంతే నితఁ డాప్తుఁడో జనకుఁడో నెయ్యంపుఁదో బుట్టువో?
నీకార్యార్థమె పూని తా నెచటికేనిం గొంచుఁ బోచున్నవాఁ
డో? 'కాఁగా దిటువంటిప'ల్కనక తోడ్తో నింతబెట్టాడ నే
నోకాంతామణి! వెఱ్ఱిఁగా నితనిచెయ్వల్ మున్ను వీక్షింం
పుదున్." 95

వ. అనుపలుకు లన్నియు విని కలభాషిణి తనమనంబున. 96

క. "ఈయవ్వవాక్యములు దలఁ
పోయఁగ నాయుల్లమునకుఁ బొందుపడినయ
ట్లై యున్నవి యీసిద్ధుఁడు
మాయవియొ యొక్కమాట మది నూహింపన్. 97

తే. "ఇంక నొక్కింతసేపున కెల్ల వగపుఁ
బుచ్చి వైచెద" నని పల్కి నిచ్చటికిని
జేరనపు డది యీయమ్మ చెప్పినట్లు
శక్తికిడియెడు ననుట నిస్సంశయంబు. 98

సీ. ప్రజల కందఱకు నాపదలు వాపెడునట్టి
చక్రిపట్టణములో జనన మంది
వారకామిని నయ్యు గౌరవంబున సభ్య
జను లిటు చేర రమ్మనఁగ బ్రదికి
త్రైలోక్యగురుఁడు నారదమౌని ప్రియశిష్య
నిర్విశేషముగ మన్నింప నలరి
జగదీశురాణివాసపుసతుల్ శిష్యగా
వింపంగ సంగీతవిద్య నేర్చి

తే. తుద కొకానొకకపటసిద్ధుం డొనర్చు
శక్తిపూజకుఁ బశు వైతిఁ జర్చ సేయ
నెంతవారికిఁ దప్పింప నెట్లువచ్చు
బ్రహ్మ దా మున్ను వ్రాసినవ్రాఁతఫలము!" 99

క. అని మది నడలుచుఁ బ్రియసఖు
లను మొఱఁగుట దలఁచి కడుఁ గలంగుచుఁ "దెగునే
యనుభావ్యమెంత యంతయు
ననుభవమునఁగాక!" యనుచు ననయముఁ గుందెన్. 100

వ. తదనంతరంబ డెందంబు డిందుపఱచుకొని ధైర్యబలంబునఁ
గంఠగద్గదిక వారించుచు నావృద్ధభామినితో నిట్లనియె. 101

శా. "అమ్మా నీపలు కెల్ల నెంతయు నిజం బై యిప్డు గాన్పించెనే
నిమ్మాయావిప్రకార మిట్లగుట యూహింపంగ లే 'కొక్కయ

ర్థమ్ముగా వీనికృపం గడింతు'నని యత్యంతాశ ప్రేరేపఁ గా
నిమ్మాడ్కిం [1]దెగివచ్చితిం దెరువు లేదీపాటు దప్పింపఁగాన్.

క. ఎక్కడికిఁ బాఱిపోయెదఁ
జిక్కపడక యేను వీనిశీఘ్రగతికి నో
యక్క యింక దూరదృష్టియు
నెక్కడు వీనికిని గాంచు నెచ్చట నున్నన్." 103

సీ. అన విని యాకె "యోవనిత! నీవు నెఱుంగు
దే వీని యాదూరదృష్టి?" యనిన
"దానన కాదె యీతఁడు నన్ను భ్రమయించి
యీరీతిఁ దాఁ దెచ్చె నిచటి" కనుచుఁ
బలికి యాతఁడు తన్నుఁ బ్రథమంబునందు గృ
హారామమునఁ గాంచు టాది గాఁగ
నది తుద గాఁగ సమస్తంబు వినిపించి
తత్ప్రసంగంబునఁ దనదు పేరుఁ

తే. గులము విద్యయు నప్పటికోరికయును
జెప్పి "యాకోర్కి సాధించుచింతఁ దక్కు
చింత యెఱుఁగక యేఁగుదెంచితిఁ గోరకకుఁ
బోవఁ బడిగల్లు వడియె" నోపొలఁతి." యనియె. 104

చ. అన విని "యట్ల యౌ నిది యథార్థము నీ కటు లాసచూపి
తోడ్కొని చనుదెంచెఁ దాఁ దనదుకోర్కి యొనర్పుట
కీవినిందవ్యవ, ర్తనుఁడు మనుష్యయత్నమునఁ దక్కఁగ నేరఁడు
దూరదృష్టి సాధన మయినట్టిపిమ్మట నితం డొనరించువిచార
మారయన్. 105

---

1. దిగి.

వ. అది యెద్ది యంటే నప్పు డితండు. 106

తే. "ఇంతపాట్లను బడి కన్న యీవిచిత్ర
మహిమకుం దగ రాజ్యసంపదలు గనిన
నెంత యిం పగునో" యని యేను వినఁగఁ
బలుమఱును వీఁడు ముచ్చటపడుచు నుండు. 107

క. ఆకోరికకై "కల వొకొ
లోకోత్తరగానయుతయు లోకోత్తరర
మ్యాకృతియు నొకతె వార
స్త్రీకులమున" ననుచు దూరదృష్టిఁ వెదకున్. 108

క. తానును గిన్నర యొకటి మ
హానందత మీటుచుండు ననిశంబును ద
ద్గానరసజ్ఞత నిలఁ గల
గానము దూరశ్రవణముకతమున నరయున్. 109

వ. అని చెప్పిన వృద్ధవనితకుం గలభాషిణి యిట్లనియె. 110

సీ. "తొల్లి యిచ్చటన యాదూరదృష్టియును దూ
రశ్రవణము సిద్ధురాత్మకుండు
సాధించి నాఁడె? తత్సాధన కెందఱెం
దఱకుత్తుకలు గోసి చెఱిచె నొకొ!
యది కొంత యెఱుఁగుదే నంగన యెఱిఁగింపు
వినియెదఁ గాలయాపనముకొఱకు
మీఁదటఁ గాఁగలమేలుగీ ల్లేరికిఁ
దప్పింపరాని యెంతయు ధ్రువంబు

ఆ. 'ఇంక వాఁడు వచ్చి యేమేమి సేయునో
చచ్చు టెట్లొ' యనువిచారమునను

బెగడు చుండ నేల జగదంబ యాశ క్తి
సేయవలసినట్లు సేయుఁ గాక." 111

క. అన విని యాయమ మెచ్చుచు
"ఘనధైర్యవివేకమహిమగలయుత్తమభా
మిని వౌదు మేలు మేలీ
వనినట్ల వచింతు నీకు" నని యిట్లనియెన్. 112

క. "ఓరమణి దూరదృష్టియు
దూరశ్రవణంబుఁ బడయుత్రోవ లితరముల్
ఘోరములైనను బరహిం
సారూపంబు లవి కావు సాహసపువిధుల్. 113

క. ఆరెండు నితఁడు వడసెం
గోరిక నలగోరుగల్లుఁ గొని నిజనయనో
ద్ధార మొనర్చియు వీనుల
ఘోరపునారసముఁబఱపుకొనియుఁగా వరుసన్. 114

వ. అనుచుఁ 1దన్మంటపాగ్రభాగంబున మృగేంద్రవాహనంబు దండ నేకాతురపంక్తిచిహ్నితశిలాస్తంభంబున వ్రేలఁ గట్టిన యాశస్త్రయుగ్మంబును మఱియు నచ్చట గంధపుష్పాద్యర్చితంబులై యున్నయొక్కసురియయు గండక త్తెరయు డగ్గఱం దోడ్కొని పోయి చూపి యిట్లనియె. 115

క. "'ఈకోరిక కిది తెరువిది
యాకోరిక' కనుచు వ్రాసి యిడినా రదె యా
ఆకంబంబునఁ జదువుము
నీ కాలిపి తెలియునేని నీరజవదనా!" 116

1. దన్మందిరాగ్ర.

సీ. అనుడు నమ్మాట దా విని కలభాషిణి
యందు నున్నర్థ మిట్లనుచుఁ జదివె
"నిచట రెండేండ్లు జితేంద్రియత్వంబున
భువనేశ్వరీమంత్రమును జపింప
నెల్లకోర్కులు నిచ్చు నిద్దేవి మఱి యట్లు
గాక సద్యస్సిద్ధి గావలసిన
దూరవీక్షార్థి యీగోరుగంట వ్రాతాక్షుఁ
డయ్యు దూరశ్రవణార్థి చెవిని
తే. ఘోర మైనట్టియీబలునారసంబు
పఱపుకొనియు సారస్వతప్రౌఢిమార్థి
యీసురియచేత నాలుకఁ గోసికొనియు
నిమ్మహాశక్తి మెప్పించి యిష్టమొందు. 117
క. ఈమెఱుఁగుగండకత్తెర
చే మిడిదల యిచ్చుసాహసికుఁడు శిరం బ
ట్టే మగుడఁగ నదుకుకొనం
గా మని చంపుఁ దనుఁ జంపఁ గడఁగినవానిన్. 118
క. పదిలముగ నిర్విపక్షా
భ్యుదయమహారాజ్యలక్ష్మి పొందుగ వశతన్
సదమలరూపసుగానా
స్పద వారవధూటి నిచట బలిగా నిడినన్." 119
తే. అని చదివి దానఁ దలఁపులో నాత్మనిధన
శంక నిస్సంశయం బయి చాలఁ బ్రబలఁ
గలఁగి చలియించుతద్ధైర్యగౌరవంబు
నంతన మగుడ్చి కడమ యిట్లనుచుఁ జదివె. 120

ఉ. "ఈవిధులందు నెందును నొకింత సమర్థత లేనివృద్ధు లి
ద్దేవతయొద్ద నిర్భయత దేహము నెమ్మెయిఁ బాసినన్ లస
ద్యౌవనరూపసిద్ధి యగు నప్పుడ యంగవిమోక్షవేళ ని
చ్ఛావృత మిద్ది వారి కది సంఘటిలుం దిరమై తదాదిగన్."

క. అని చదివిన నందుఁ దుదన్
వినఁబడినవిధానమునకు వృద్ధాంగన యిం
పున నవ్వుచు "నిది విని సు
మ్మనిశము నే నిచట నునికి యంబుజనయనా! 122

తే. అబ్జముఖి సుముఖాసత్తి యందు నన్నుఁ
గరము కాశ్మీరభూమిఁ బ్రఖ్యాత మైన
శారదాపీఠమున సరస్వతిని గొల్చు
నట్టుపూజరిబ్రాహ్మణుపట్టి నేను. 123

వ. అనునంతట సిద్ధుండు దేవీపూజకుఁ దగినగంధమాల్యాదులు సంపాదించుకొని వచ్చి యమ్ముదుసలిపడఁతిం జూచి, "యో యవ్వ! కుశలంబున నున్నదానవే? నిర్మనుష్యం బైనయీ శక్తిస్థానంబునఁ జిరకాలంబునం బట్టి యెట్లు వేగించుచున్న దాన?" వని పలికి కలభాషిణిం బిలిచి, "యోచెలువ! మనకు నవ్వల చనవలయుఁగద; మిక్కిలి ప్రొద్దు పోవుచున్నయది; శక్తిం బూజించి పోవుద మాయమ్మచేత ననిపించుకొని ర"మ్మనుటయు నది భయాకులమానస యగుచు వృద్ధాంగనంజూచి. 124

క. "ఏ నొంటిఁ బోవ వెఱతున్
లోనికి నోయమ్మ! నీవునున్ రాఁగదె నా

తో" నన "నెవ్వరు నేటికి
నే నుండఁగ" ననుచు సిద్ధుఁ డింతిం బలికెన్. 125

సీ. పలికి యప్పటిదానిభయచేష్ట భావించి
"యిమ్మదిజంతచే నిది యొకింత
యే మైన నాతలం పెఱిఁగెఁగాఁబోలు వి
ఘ్నం బేమి యగునో విలంబ మైన"
నని సిద్ధుఁ డాత్మలో ననయంబు వేగిరిం
పుచు "నోసిబెల్లి! యిమ్ముపలివగ్గు
నీకుఁ దో డై వచ్చునో? కలదో మఱి
యే మైన" ననుచు నాయిగురుఁబోఁడి
తే. కొప్పువట్టి తివంబోవ నప్పడంతి
ప్రాణభయమునఁ గలఁగి "యోయవ్వ! నీకు
బిడ్డనే కావవే నాకు నడ్డపడవె"
యనుచు నావృద్ధనారిమాటునకు నొదిఁగె. 126

క. ఆవృద్ధనారియును గరు
ణావిలమతి యగుచు నాభయార్త మృగాక్షిం
దా వెనుక నిముడుకొనుచుం
"గావుము కావు"; మని వానికరములు పట్టెన్.

సీ. పట్టిన నతఁడు "లోపలికి రాకుండ వి
ఘ్నము సేసె; దింతియా కద!" యటంచుఁ
"దద్దేవి కిచటు ముందర గాదె!" యంచు న
ప్పడఁతిచేతులు నుల్చి పాఱఁ ద్రొబ్బి

బలిమిఁ దార్కొని కలభాషిణి వేనలి
యొకకేలఁ బట్టి వే ఱొక్కకేల
నొఱఁ గత్తి వెఱికి "నీ కొప్పన మిదే" యంచు
సత్తికిఁ గత్తిచే యెత్తి మ్రొక్కి
ఆ. వ్రేయఁ బూన, "[1]దీని వ్రేసితే నిద్దేవి
యాన సుమ్ము నీకు!" ననుచు డాసి
యానెలంత మెడకు నడ్డంబుగా మెడ
యొగ్గె వృద్ధసతి యనూనకృపను. 28

వ. ఇవ్విధంబునం గలభాషిణికంఠంబునకుఁ దనకంఠంబు నడ్డంబు సేర్చి వ్రేటు కనువీక దాని నిరుఁగేలం బోదుగఁ బట్టుకొని పరమకరుణాపరవశత్వంబునఁ దొలంగక యావృద్ధభామిని "యోయిసిద్ధుండ! నీకుం గార్యసిద్ధి గాదు సుమీ! యిద్దేవిమీఁది యాన నతిక్రమించిన!" ననుచు "నో మహాశక్తి! నన్ను సత్యవచనం గావింపుమీ!" యనుచు నుండ నతం డఖండరోషంబున మున్ను దానిమెడ ఖండితంబు సేసి విచిత్రవేగంబునఁ గలభాషిణికొప్పువట్టి పట్టెంబు జళిపించి వ్రేయ నెత్తుటయు, నెత్తినచేయి తత్క్షణంబ యందుకొని మృగేంద్రవాహన నిజశపథసముల్లంఘనోత్సాహసాహసదోషదూషితుం డగునతని నతిదూరంబునం బడవై చె. సుముఖాసత్తియు నట్లు సంప్రాప్తంబైనయసివిఘాతంబునందనజరద్దేహంబు వడినట్టితఱిణంబునంద.

సీ. నిండుచందురు నవ్వు నెమ్మోముసిరితోడ
నిరులు గ్రమ్మెడు వేణిభరముతోడ

1. దీన.

నాకర్ణలోలంబు లగునేత్రములతోడఁ
దళుకొత్తుచెక్కుటద్దములతోడ
మిగుల మిటారించుబిగిచనుంగవతోడ
లలితంపుబాహువల్లరులతోడ
నతికృశత్వమున జవ్వాడుమధ్యముతోడ
నభినవం బైననూఁగారుతోడ
తే. వలువమీఁదికిఁ దోలఁకుసువర్ణపులిన
గురునితంబప్రభాపరంపరలతోడ
మహితసర్వాంగలావణ్యమహిమతోడ
నమరుప్రాయంపురూపు చిత్రముగఁ దాల్చె. 130
తే. తాల్చి యావికచోత్పలదళనిభాక్షి
కనుఁగొనియె నభ్రమున శక్తికరవినున్న
గాత్రు సిద్ధుని నొకకేలఁ గత్తి యొక్క
కేలఁ గలభాషిణిని విడకే చనంగ. 131

క. ఆకరణిఁ జూచినది యై
యాకలభాషిణియవస్థ కాత్మఁ గలఁగుచున్
వ్యాకులత నొందెఁ దనదు చి
రాకాంక్షితసిద్ధి పెంపు నరయనిమదితోన్. 132
సీ. అంతఁ గ్రమంబున నాసరోజాక్షి సం
సారస్వభావవిచారమహిమ
వలనఁ దద్దుఃఖంబు వారించికొని దానఁ
దాను భోగార్థచింతనము వదలి
దేవిసత్కృపఁ బ్రసాదించినయట్టిజ
వ్వనపుసత్త్వము వృథా చనకయుండ

యోగవిద్యాభ్యసనోపయోగంబునఁ
గడపెదఁ గాకంచు విడువ కెపుడు
తే. యమనియమవర్తనములతో నాసనాదు
లభ్యసింపఁగఁ దొడఁగె నత్యాదరమునఁ
దాను మును విన్నభంగులు దాఁపు గాఁగ
నచటిశక్తిని గురువుగా నాత్మ నునిచి. 133

వ. అంతటం గలభాషిణి యచ్చటి కేగుదెంచి యాచంచలాక్షి
నీక్షించి "నీవెందుండివచ్చి? తెట్టిదాన?" వని యడుగుటయు,
నప్పడంతి "యేను మును నీకు నడ్డపడి సిద్ధునిచేత ఖండిత
యైనసుముఖాసక్తి యనువృద్ధవనితం జుమ్ము; క్రమ్మఱ నిమ్మహా
శక్తికారుణ్యశక్తివలన నిట్టియెలప్రాయంపుసొంపు వడసి
యున్నదాన." నని తత్ప్రకారం బెఱింగించి "యోకల
భాషిణి! యట్లు సిద్ధునితోడ నిమ్మహాశక్తిచేత దూరవిక్షిప్తవై
యెచటంబడి తేమియు నొవ్వక యిట్లు తిరిగి వచ్చుట యద్భు
తం బగుచున్నది" యనుటయుం గలభాషిణి "యోయమ్మ!
ధర్మగుణంబున నిమ్మహాదేవిని మెప్పించి యిప్పగిది నీవు తిరు
గం [1]బ్రాయంబు గనుట యద్భుతంబు గాక; యింతటిమహా
పుణ్యనిధి వై ననీదుకారుణ్యంబు గలుగ నేఁ దిరిగివచ్చుట
యేమియద్భుతంబు? నావిధం బంతయు విన్నవించెద" నని
పలుకుచుండ. 134

క. బంధురవీణాసహిత
స్కంధముతో రత్నమాలికాఘటితజటా

---

1. బ్రాణంబు.

బంధముతో సంతత మణి
కంధరుఁ డచ్చటికి వచ్చె గంభీరగతిన్. 135

క. వచ్చినఁ గని యతిమోదము
నచ్చెరువుఁ దలిర్ప మ్రొక్కె సతని; కతఁడుఁ దా
నచ్చెలువఁ జూచి మోదము
నచ్చెరువుఁ దలిర్ప వికసితాననుఁ డగుచున్. 136

క. "ఓహోహో! మాబంధు
వ్యూహం బంతయును వచ్చియున్న ట్లయ్యెన్
నాహృదయమునకుఁ బరమ
స్నేహనిధిన్ నిన్నుఁ గనుట నేఁడు లతాంగీ. 137

మత్తకోకిల. మచ్చెకంటి మనుం దలంతువె మానసంబున? నిందునీ
వచ్చు టెట్లు? కడున్ విచిత్రము ద్వారకాపురి వాయ నీ
కిచ్చ పుట్టుట? యెన్నఁడున్ మఱి యిట్టు లేగి యెఱుంగ వీ
వచ్చెలుల్ మణిగేహముల్ సిరు లట్ల యున్నవియే కదా! 138

సీ. ఉత్తమశ్లోకుఁ బయోజాక్షు సేవింప
నేగితే యావెన్క నెన్నఁడైన?
నాజగత్పతి తోంటియలవజ్రమణిసభ
కేతెంచి కొలువు సేయించుకొనునె?
తనసేవఁగాఁ బురందరుఁడు గట్టించికెం
పులహజారము కడముట్టె నొక్కొ?
మనవీణియ లడంచుకొని భ్రమయించు నీ
లపుటరుంగులకుఁ బో నిపుడుఁ గలదె?

తే. యంతకంతకు వర్ధిల్లుహారిసుమాళ్ల
బల్లఁగమున కిది చాల దస్తలఁపుతోడఁ

దిరుగఁ గట్టింత మనుపైఁడి[1]గరిడిసాల
యట్లయున్నదియే వికచాబ్జవదన? 129

మ. చిగురుంబోఁడి యెఱుంగుదే 'యదుపతి స్త్రీ లెవ్వారే నిందులే
రు గదా!' యంచును శంకఁ గ్రమ్మజేతిఁ జారుద్యూత
గేహంబు క్రొత్తగ నీవొక్కటి చూపఁ దోడ్కొని చనం
దచ్చోట చెవంచ యిత్తిగ బారా దుగ యంచుఁ జిల్క
రొద లుద్దీపింప దా దవ్వులన్? 140

చ. కుటిలకచా! యెఱుంగుదువె గొబ్బున నేఁ జని కొల్వుకూట
మొక్కటి కడ నున్కి యారయక కట్టెదుటం బటికంపుగోడఁ
బ్రస్ఫుట[2]ముగ దానియందు హరిఁ జూచుచు మ్రొక్కఁగ
వెన్కనుండి [3]"యిట్టిటు మొగి?" యంచు నవ్వె సభయెల్లను
దన్మణిభిత్తి యున్నదే?" 141

క. అని యడిగిన "నన్నియు శో
భనవర్తనఁ దొంటియట్ల భాసిల్లెడు నో
యనఘ! సురరాజుసేవయు
ననుపమముగఁ బూర్ణ మయ్యె" నని యది పలికెన్. 142

వ. అని పలికిన నతండు. 143

సీ. "సంగీతవిద్యాప్రసంగంబునం దైన
మముఁ దలంతువా లేదా మనసునందు?
దనుజారి కే నొసర్చినదండకంబు నీ
వెందైన మఱి వెలయించి తొక్క?
యిప్పుడు నారదుం డప్పటప్పటికి వ
చ్చునో రాఁడో వసుదేవసూనుఁ గొలువ?

1. గరడి. 2. మగుదాని నందు. 3. యట్టిటు.

నాలోకవిభుసతుల్ మే లేర్చి యిచ్చిన
వీణె యే మయ్యెఁ దే విచ్చుటికిని?

తే. నేమియేమియొ నాఁడు నీహృదయమునను
గోర్కె యొక్కటి గలుగుట కొమ్మ వింటి
నది ప్రవృద్ధంబుగాఁ బెంచి యాత్మలోన
విడిచిపెట్టితొ వీణెపై వేడ్క లెల్ల." 144

చ. అనుటయు లజ్జ నజ్జలరుహానన యించుక యించుక యోర
గాఁగ వంచినమొగ మొప్ప "నే మనుచుఁ జెప్పెద! దానన
చేసి కాదె యో, యనఘచరిత్ర! నాకుఁ గలయట్టి
బలంగము లెల్లఁ బాసి యీ, ఘనగహనప్రదేశములఁ గష్టపుఁ
బాటులఁ గుందితిం గడున్." 145

వ. అని పలికి తనగానవిద్యాభ్యాసపరిసమాప్తి యైనపిమ్మటఁ దన యున్నచోటికి మణిస్తంభుండు వచ్చినప్రకారం బెఱింగించి యతండు దూరదృష్టి దూరశ్రవణశక్తిబలంబునఁ దనకుం జెప్పిన యర్థము సకలంబునుం జెప్పి తన్ను నతండు మృగేంద్రవాహనాభవనంబునకుం దెచ్చినతెఱంగును బలిపశూకరణోద్యమప్రకారంబును సుముఖాసత్తి తన్ను రక్షించుటయు వివరించి "యాపుణసాధ్వి యీయమ" యని యాయకం జూపి తత్కాలస్థానవర్తనంబులు దెలిపి "యోగంధరోత్తమ! యింక నాకు నీచందంబు వినవలయు నవ్విధంబున రంభచేత నీతపంబు విఘ్నంబు నొందుట యామణిస్తంభునిచేత నేను విన్నప్రకారంబు వింటివి కదా! యటమీఁదటి భవదీయవర్తనం బెఱింగింపు"మనునంతట మణిస్తంభుండు వచ్చుటయు "నిప్పుఁ డేఁ జెప్పినసిద్ధుం డితం" డని చూపిన

"నితండా! యని దరహసితవికసితాననుం డగుచు మణికంధ
రుం డతనిం దగు తెఱంగునసంభావించె; నతండును. 146

క. ఇచ్చోఁ దదాగమనమునకు
నచ్చెరువు జనింప "నిది మహాశ్చర్యము! మీ
రెచ్చోటనుండి యిచటికి
విచ్చేసితి?" రని వినీతవృత్తిం బలికెన్. 147

సీ. పలికి యంతటఁ గలభాషిణిఁ జూచి "యో
యింతి నీ వెదకితి నెల్లచోట్ల
నెందుఁ గానక చోద్య మందితి నప్పు డె
క్కడ నుండి తిప్పు డిక్కడికి వచ్చి
తని పల్కుచును సుముఖాసత్తిఁ జూచియో
చ్చటనుండి వచ్చి తిచ్చటికి నీవు?
పే రెద్ది? యని తత్ప్రకారంబు దానిచే
తన విని వెఱఁ గంది వినుతి చేసి

తే. నాసతి యతనిఁ గనుఁగొని యరుదుపడుచు
నిట్లనియె "నోయిసిద్ధుండ యిచటఁ బడితి
[1]రీవుఁ గలభాషిణియును నిద్దేవిచేత
నట్లు సరభస విక్షిప్తు లగుచుఁ బోయి? 148

వ. మీర లేమియు నొవ్వక తిరిగి వచ్చుటయు నచ్చెరు వై
యున్నయది. నాకు నింతయు వినిపింపవలయు" ననిన విని
మణిస్తంభుం "డోయంబుజముఖి! నీకు నట్లవినిపించెద విను
మదియు కాదు మఱియు నెన్ని యేని విచిత్రంబులు గని వచ్చి
నాఁడ; నది యొక్కరితోడం జెప్పెడునందాక హృదయంబు

1. పీవు.

వేగిరపడుచున్నది గావున, నన్నిటం బూజ్యురాల వైనసీకు
వినిపించెద” నని యిట్లనియె. 149

ఉ. “ఆనిధి నీపయిం దెగి మదాతిశయంబునఁ గన్నుఁ గానమిఁ
దేవతమీఁది యానయు గణింపక యీకలభాషిణిఁ శిరో
జావళి పట్టి త్రుంచుటకు నాయుధ మెత్తితి నెత్తినట్టికేల్
దేవి వహించి వైవఁ జనితిం గడు దవ్వుగ నివ్వధూటితోన్.”

మ. అనుడుఁ “నీవిది చెప్పఁగా వలవ దే నామున్న యీరూపుఁగై
కొని వీక్షించితి నేను నీచిగురుటాకుంబోఁడి మూర్ధంబు ప
ట్టిన కేల్ పట్టినయట్ల యుండ ధృఢముష్టిం బూని బల్గత్తి యె
త్తిన కే లెత్తినయట్ల యుండ దివి నుద్వేగంబునంబోవుచోన్.

క. వినుపింపు నాకు నట మీఁ”
దన నతఁ డిట్లనుచుఁ జెప్పె “నట్లురవడి [1]వం
చనమున వైచినగతి నభ
మునఁ జని మణికంధరుని తపోవనభూమిన్. 152

క. ఇత్తరుణియు నేనును నొక
మెత్తనిక్రొత్తలిరుఁ బాన్పుమీఁదఁ బడితి మో
మత్తేభగమన యట్లే
సత్తియుఁ గృపసేయఁ బోలుఁ జావక యుండన్. 153

క. మునుపటిభయమున మ్రాన్పడి
యునికి నపుడు చేతికత్తియును దనదుశిరం
బునుఁ విడువఁగ నెఱుఁగనినను
గనుఁగొని నెమ్మేను మిగుల గడగడవడఁకన్. 154

---

1. దంచనమున.

సీ. అమృతంబు దొలఁకున ట్లమరంగ వెల్వెలఁ
బాఱు ముఖేందుబింబంబుతోడ
జాలఁగర్ణద్వయీకూలంకషంబులై
తల్లడం బందునేత్రములతోడఁ
గడుఁ జెమర్చినయట్టికలికిలేఁజెక్కుల
నంటెడువిగళత్కచాళితోడ
బలిగుబ్బపాలిండ్ల నిలువ కిట్టట్టు సం
క్షోభించుపయ్యెదకొంగుతోడ
తే. వెఱపు నొకయొజ్జ యై వింతవిలసనములు
గఱపఁ జూపట్టుసౌందర్యగరిమతోడ
సరభసాకర్షణాతిక్షోభ చకిత యైన
మదనుజయలక్ష్మిలీల ని మ్మగువ దనర. 155
క. కనుఁగొంటిం గనుఁగొనునం
తన మన్మథవశుఁడ నగుచుఁ దగఁ బరిరంభం
బును గావించితి నేఁ జే
సిన పాపముఁ జెప్పవలయు శీతాంశుముఖీ! 156
మ. అది సైరింపక [1]బాలఁ బేరెలుఁగుతో నాక్రోశముం జేసె "న
న్నిదె యీపాతకి బల్మిఁ బట్టెడుఁ గృపన్ వీక్షింపరే కావరే
[2]సదయత్వంబున నొప్పుసత్పురుషు లిచ్చో నెవ్వరున్ లేరె యా
పద వారింప శరణ్యులార" యని యాపద్భ్రాంతియత్యంతమున్.
వ. అప్పుడు: 158
క. నెఱయఁగ నసహ్య మగున
మ్మొఱ వీనులఁ బడిన మిన్నుముట్టునెలుఁగుతో

1. చాల. 2. సు(యతితప్పినది.)

"వెఱవకు వెఱవకు మే నిదె
పఱతెంచితి సత్వరముగ భామిని" యనుచున్. 159

క. వెఱవక యెవ్వఁడురా వెత
పఱచెదు ని ట్లతివ! నెందుఁబాఱిన గూడం
దఱిమెదఁ దల నరములతోఁ
బెఱికెద" ననుచుఁ నితాంతభీషణగతితోన్. 160

చ. ఒకపొదరిల్లు వెల్వడి రయోద్ధతుఁడై నలకూబరుండు రాఁ
బ్రకటముగాఁ గనుంగొని యభంగురభీతిఁ గలంగి దీని నే
వికలమనోధృతిన్ విడిచి వేగమ దవ్వుగఁ బాఱిపోయితిం
బ్రకుపితుఁడై యతండుననుఁబాయక వెన్కొని పట్టెను గ్రతన్.

వ. అట్లు కూడముట్టి పట్టుకొని: 162

శా. "ఓరీ యెవ్వఁడవీవు? పాతకముతో నున్మాదివై యిప్పు దే
నారిం బట్టితి బెట్టుగా మొఱ యిడన్? నాదండ నీదుండగం
బా? రా రమ్మటు దానిఁ జూపుదువు ప్రాయశ్చిత్తమా మీఁద నీ
కేరీతిం దగు న ట్లొనర్తు" నని తా నెంతే నమర్షంబునన్. 163

వ. కొంతమేర నన్నుం గ్రమ్మఱఁ దెచ్చునంత. 164

సీ. తిరముగా ముడువమి విరియఁ బాఱెడుకొప్పుఁ
దోడ్తోడ నొకకేలఁ దుఱుముకొనుచు
వల్లెవాటుగఁ గొంతవలువ చన్గవ నిల్పి
వెఱచేత నీవి గల్పించుకొనుచు
నుదుటిపై నొక్కింత చెదరినముంగురుల్
పాపటకును బొందుపఱచుకొనుచు
సారెకు జాఱెడు శ్రవణకల్హారంబు
లందంద మూఁపున నానుకొనుచుఁ

తే. జెముట నంటినపానుపుచివురుఁదునుక
లెడనెడ నఖక్షతాశంకఁ దడవుకొనుచు
రంభ యేతెంచె మిగుల సంరంభ మమరఁ
దొలుతఁ బ్రియుఁ దేగుదెంచిన త్రోవవట్టి. 165

శా. ఈలీలం జనుదెంచి "యక్కటకటా యేమంచు నిర్దూఱుచుం
గేలం గైదువు గీదు వేమియును లేకే యిమ్మెయిన్ వత్తురే
[1]చాలున్ దూరముగాఁగ? నే నిదె పరిశ్రాంతింగడున్ నొచ్చితిం
జాలుం జాలుఁగరంబు మెచ్చఁ దగు నీచందంబు ప్రాణేశ్వరా!"

వ. అని తనదుప్రియుం బలికి సన్నుం గనుంగొంచు నతనితోడ.

క. "వీఁడా యట్లన్యాయపుఁ
బోఁడుములకుఁ బూనినట్టిపుణ్యుఁడు? పూవి
ల్కాఁడో వల్లభ యెంతటి
వాఁడైన నగున్ విశంకవర్తనుఁ డెందున్. 168

క. ఆయింతి యెందుఁ బోయెనొ
కో?" యనుటయు "దానిఁ జూపుకొఱకునె కాదే
యీయయ్యఁ బట్టి తెచ్చుట
యోయంగన యిప్పు" డనుటయును గృపవొడమన్. 169

వ. "ఆయింతిం జూపక యితం డింక నీముందట నెందుఁ బోయెడుఁ
జెయి వదలు" మనుచు బ్రార్థించి. 170

తే. విభునిచే విడిపించె నవ్వేలఁది నన్ను
నేను వారలఁ దోడ్కొని యీనెలంత
యున్నచో టారయుచు మును పున్న తలిరుఁ
బాన్పుఁ జూపితిఁ గాన [2]నిప్పడఁతి నచట. 171

1. చాలన్. 2. మిప్పడఁతి.

వ. అట్లు చూపినం దనయింతితోడ. 172

క. "తానును మనతోఁ బుట్టిరి యీ
పానుపుఁ జేర్చుకొనఁ [1]బోలుఁ బడఁతుక'' ననుచున్
"బోనీ సిద్ధుఁడు గాన స
న్మానం బగుసిద్ధశయ్య కుచితుఁడ" యనుచున్. 173

క. అట్టియెడ నచ్చటన్ నా
[2]పట్టముఁ గని పుచ్చుకొనియెఁ బౌలస్త్యసుతుం
"డిట్టివియుఁ దనకుఁ గొన్నియె?
గట్టిగ నీజోగి బంటు గదె!'' యని నగుచున్. 174

తే. బంటు గాకున్న నిది యిందుఁ బాఱవైచి
వెళ్లునే! యని నవ్వె నవ్విబుధ కాంత
యంత నన్నియు నయ్యెఁ; నయ్యతివ నెచట
నడఁచి తని నన్ను దట్టించి యడిగె నతఁడు. 175

సీ. కినుకతో నట్లింతయును బెదరించుచుఁ
బినువీఁకు సేయఁ దత్ప్రియవధూటి
వీనితో డిది యేమి? విడిచిపెట్టుము వీఁడు
తను నట్లు డించి వెళ్లిన నెడ గని
యాయింతి డాఁగి యెం దరిగెనో? యెచటఁ జూ
పెడు నంచు నను విడిపించి దాని
మన మిఁక వెదకుదమని తాను నాతండు
నేఁ దోల్తఁ బాఱిపోయిన తెరువునఁ

తే. జనియెఁ గడుదవ్వుగాఁ గుచస్తబక మొకటి
వరునిభుజముతో నొరయ నవ్వలితదంస

1. బోవుఁ. 2. పట్టెము.

భాగమునఁ దనకోమలపాణిఁ జేర్చి
యనుపదంబును రోమాంచితాంగి యగుచు. 176

ఉ. ఏనును వారివెంబడిన యేగితిఁ బాయకయింత నంత "నెం
దేని మనోభవక్రియల నింపున నేమఱి పెట్టిపోవునో,యానల
కూబరుండు మదుదగ్రకృపాణము" నంచు దాని నన్యాన
గురుప్రసాదమహిమోన్నతిఁ గాంచుటఁ బాయఁజాలమిన్.

చ. అదియును గాక యావిపిన మంతయు నెంతయు సావధానతన్
బదిలము గాఁగ నప్పడఁతిఁ బాయక యప్పుడు దూరదృష్టిచే
వెదకికనంగ లేక కడు విస్మయ మందుచు "నేమి మాయయో!
యిది యని, వీరికైన నొకయీగడ వెళ్లునా?" యంచు
నేగితిన్. 178

క. అంతట నాయిరువురు న
త్యంతము నంగాంగసక్తినాత్మలు గరఁగన్
గంతుక్రీడలు సైకొని
రెంతయు నెడ గలుగ నేగి యేను నిలిచితిన్. 179

శా. ఆలీలన్ రతికేళిఁ దేలి తుదయం దాయిద్దఱుం గేలిభి
న్నాలంకారము లొక్కరొక్కరికి నింపొనట్లుగా దిద్దుచున్
లోలత్వంబున నుండ నచ్చటికి నాలోఁదత్పదశ్రేణిచో [న్.
ప్పాలోకించుచు రంభ వేఱొకతె డాయన్వచ్చెఁ జిత్రంబుగ

ఆ. వచ్చి చిచ్చువడియె నచ్చెరు వందుచు;
నచ్చకోరనయన వచ్చు టరసి
యద్భుతంబు నొందె యక్షేశసుతుఁడు; న
వ్విధముఁ జూచి యేను వెఱఁగుపడితి. 181

ఉ. అంతట యక్షరాజసుతుఁ డాకరణిం జనుదెంచి యున్నయా
కాంత ప్రకారముం దనదుకాంత ప్రకారముఁ గొంతప్రొద్దు వి
శ్రాంత మహావధానమునఁ గ్రమ్మఱి క్రమ్మఱి చూచె నెందు
[1]నొ, క్కింతవిభేద మేర్పడమి కెంతయు నద్భుత మావ
హిల్లఁగన్. 182

క. ఈమాడ్కిఁ జూడ "నను న
క్కామినిఁ గడుఁ దిరిగి తిరిగి కనుఁగొనియెదు నీ
వేమి యిది? నాకుఁ జెపుమా
నీమది?" యని యతని నతనినెలఁతుక పలికెన్. 183

వ. ఇట్లు పలికిన నతండు. 184

తే. "నీదు ప్రతిబింబ మదియొ దాని ప్రతిబింబ
మీవొ యేమని చెప్పుదు నిగురుఁబోఁడి!
యేర్పఱుప రాక యున్నవా రీవు నదియు
దీని కరుదంది చూచెదఁ దిరిగితిరిగి. 185

క. తుద నేమి చెప్ప! నాదం
డ దొలంగిన దాని నినుఁ దడంబడకుండన్
మదిలోన నేర్పరించుట
సుదుర్లభ!" మ టన్న నతని సుదతి గలఁగుచున్. 186

సీ. "అట్లైనఁ బ్రాణనాయక నినుఁ గౌఁగిటఁ
బాయనే వెఱతు నీ మాయలాఁడి
యీరూపుతో మన కేడ నేయ నేతెంచి
నదియొ! తొల్లియు నొక్క యసురజంత

1. నొక్కింతయు భేద.

జనకనందనకు రామునకును నెడసేయఁ
గడఁగి వచ్చుట వినఁబడుచు నుండుఁ
గావున దీని నిక్కడఁ జుట్టుపట్టున
నుండంగ నిచ్చిన నొప్పకుండు

తే. వట్టి మొగమోట పాలించి గట్టిగాఁగ
వదర [1]వైచుచుఁ జనుమంచు నౌర నీవు
కదలెదు సు!" మంచు సంభ్రమం బొదవ నపుడు
కాంతుకంఠంబు నొకకేలఁ గౌఁగిలించె. 187

క. క్రొత్తగ వచ్చినరంభయు
నత్తెఱఁ గంతయును గని కరాంగుళి నాసన్
హత్తించి తలఁ గదల్చుచు
నుత్తలపా టేర్పడంగ నుస్సురు మనియెన్. 188

ఉ. అక్కమలాక్షిఁ జూచి యలకాధిపనందనుఁ "డోపడంతి! నీ
వెక్కడనుండి వచ్చి? తిది యేటికి నుస్సురు మంటి? నీకు నీ
యక్కజ మేలవచ్చెను? [2]మదంగనరూపముఁదాల్చి తేగతిన్?
రక్కసివో పిశాచివో కరం బిది చిత్ర! మెఱుంగఁ జెప్పుమా."

క. అన నయ్యంగన "నా కే
మన నోరున్నయది? మీర లనినంతయుఁ జె
ల్లున మీ కౌఁగాములు దె
ల్ప నుపాయం బొకటి గానఁ బడునంచాఁకన్. 190

ఉ. రక్కసి వన్నెఁ గానఁగ రాదు పిశాచియు నౌదు నాదురూ
పెక్కడఁ దాల్ప నేరిచియొ యిమ్మెయి నెంతయు హత్తుకొన్న

1. వైచి పొమ్మను మంచు. 2. సురాంగన.

యీ, చక్కనిముద్దరాలు తనసత్యము లోక మెఱుంగ నింకఁ
ద్వారకకు సిరో పిశాచియొ తిరంబుగ నేర్పడి పోవునంతకున్.

క. విను మాయేర్పాటు దనం
తన యగుచున్నయది యెట్లుఁ దప్పదు సత్యం
బనఁగా దైవం బనఁగా
జనులకు లేకున్న నెట్లు జగములు [1]నడుచున్. 192

క. దైవం బనఁగా నా కిఁక
నోవల్లభ వేఱ యొక్కఁ డున్నాఁడే? యా
దైవమవు నీవ చేయం
గావలసిన నీవ చేయఁగల వేర్పాటుల్. 193

సీ. అల్లప్పు డొకచోటఁ జల్లనిసురపొన్న
నీవ మెచ్చుచును నాతోడఁ గూడి
యందుఁ బల్లవశయ్యఁ గందర్పకేళి నిం
పొందుచోఁ బడమటియందు నొక్క
వనితయాక్రందనధ్వని వినఁబడుటయు
నీవు డిగ్గన లేచి పోవుచుండ
నేను నీతోడన యేతెంచుచో నొక
యిట్టె డాపలివంక నేగుటయును
తే. జూచి నిలిచితి నేను నిల్చుటఁ గనుఁగొని
యెచట నెట్లిది హత్తెనో యెఱుకపడద
వేగిరించక నీవ భావించుకొనుము
కల్లనిజములు క్రమముగాఁ గానవచ్చు." 194

1. నడచున్.

చ. అనుడుఁ గుబేరసూనుమొగమారసి తత్ప్రియ యొక్కకేలనా
తనిమెడఁ గౌఁగిలించియు యుపంచితహాసముతోడ నిట్లనున్
"మనచరితంబుఁ జెప్పెను సమస్తము వేల్పులసాని చెప్పిన
ట్లు నిజము గాఁగ నివ్వరవిలాసిని యెచ్చటనుండి చూచెనో?

తే. అచట నపు డట్లు నినుఁ గూడి యలరినదియు
నట్లు నీ వేగుచో వచ్చినదియుఁ దాన
యగుచుఁ దోఁప సం దదికి యె ట్లాడ నేర్చె!
మగువ గాదుర యిది పెనుడగర గాని. 196

ఉ. ఇప్పగిదిన్ మదాకృతి వహించి నినున్ ననుఁ బాయఁ జేయనే
చొప్పున నైనఁదాఁగలయఁజూచు దురాశలమాయలాఁడి వా
తప్పక [1]యింకఁ దత్తదుచింతపుఁగుయుక్తులమాట లెన్ని యే
[2]నొప్పఁగ నాడుకో నెఱుఁగ కుండెనె? యిట్టివి చెప్పనేటికిన్?

క. విను వల్లభ 'క న్నుండం
గనుపాపం దివియ నేర్పు గలమునిము' చ్చీ
వనిత; తగ దిచట నుండన్
వెనుకను దిద్దుకొన వచ్చు నే యొకపైనన్!" 198

వ. అని యచ్చటఁ దన్ను నిలువనీక పోఁదోలుటకు నిజవల్లభుని
సత్వరంబుగా బోధించునాచంచలాక్షిపలుకులకు నలుకబలియ
మనంబున సైరింప లేక యాకంబుకంఠి దాని నధిక్షేపించుచు
నిట్లనియె. 1!9

క. "త్రుళ్ళఁగ నేటికి? నిలునిలు;
మిల్లలికినఁ బండు వగునె? యింతటిలోనే

1. యింత త. 2. నొప్పఁగ.

వల్లభునకుఁ గడు నచ్చిన
యిల్లాలవె? యేను లాఁతినే పోఁదోలన్? 200

క. మగఁ డాపట్టంబునఁ దలఁ
చెగఁ గొట్టినఁ గొట్టుఁ గాక తెకతేరఁగ నీ
కెగవిడిచి పోయెదనె ప్రా
వగ నాకాణాచియైనవలపులపంటన్! 201

క. ఈరీతిని మద్వల్లభుఁ
గోరిక మెడఁ గౌఁగిలించుకొని నీ వుండన్
సైరించుట కొఱగా దిది;
రార మ్మిఁక నోర్వఁజుమ్ము రావే" [1]యనుచున్. 202

క. వెడ దెరువు లిచట జెల్లవు;
"పుడమి నహహా! దొంగ లాన వొడిచినఁ గోకల్
విడుతురె?" గణింతునే యొ
క్కడిగతిమాలినపిశాచికవో నీమాటల్." 203

వ. అనుటయు నాయింతి సైరింపక. 204

మానినీవృత్తము. అంత మదింపకువే యని పల్కిన
నంత మదింపకువే యనుచున్
గంతు లడంచెద లెమ్మని పల్కినఁ
గంతు లడంచెద లెమ్మనుచున్
రంతుల నేమిఫలం బని పల్కిన
రంతుల నేమిఫలం? బనుచున్
బంతము చూడఁగదే! యని పల్కినఁ
బంతము చూడఁగదే! యనుచున్. 205

---

1. యనుడున్.

సీ. ఒట్టు సుమీ! యన్న నొట్టుసుమీ! యంచు
నేమేమి? యనిన నేమేమి? యనుచుఁ
గానీగదే! యన్నఁ గానీ గదే! యంచు
నిం కేల? యనిన నిం కేల? యనుచు
నోసి పోవే యన్న నోసి పోవే యంచు
నౌ నంటి వనిన నౌ నంటి వనుచు
మఱవకు మిది యన్న మఱవకు మిది యంచు
నీవెంత? యనిన నీ వెంత? యనుచు
తే. నొకతె మగనికి నాసించు టొప్ప దనిన
నొకతె మగనికి నాసించు టొప్ప దనుచుఁ
బట్టి యాడె నారంభతోఁ బ్రథమరంభ
ప్రియుఁడు నిలు మన్న నిలువక పెద్దరొదగ. 206
వ. అంత. 207
చ. జగడపుఁగూటిస త్తరువు సారెకుఁ గోరుచు వీరి వారినిన్
దగిలెదుతందనాలజడదారి పొరింబొరిఁ గుంచె వీచుచున్
మిగులఁగ వీణెమీటుచును నేఁడుపడంతుల[1]యొద్దనుంగడున్
నెగడెదువిందు గల్గెనని నెమ్మది మెచ్చుచు వచ్చెఁ జెచ్చెరన్.
క. వచ్చిన గుబేరసూనుఁడు
వచ్చెలువలు నెదురుగాఁగ నరిగి యతనికిన్
నిచ్చల మగుతాత్పర్యం
బచ్చుపడఁగ మ్రొక్కి రతఁడు నల్లన నగుచున్. 209
క. "నలకూబర నీ కిం దే
చెలువ ప్రియవధూటి నాకుఁ జెపుమా? దానిన్

1. వర్ధెనన్.

తెలియక దీవింపఁగ రా
దలరుఁ డొకరొకళ్లప్రేమ" ననుచుఁ గిమ్మున్. 210

మ. "తనకంటెం బ్రియ నీకులేదు తనసౌందర్యంబె సౌందర్య"మం
చును గర్వించుచు నున్నరంభమదముం జూడంగలే కిట్టి దా
నిని నీవే సృజియించితో? యదియ తానీతోడఁ గ్రీడింపఁగాఁ
దనమేనొక్కటిచాలదంచుఁ గడఁకన్ ద్వైరూప్యముం దాల్చె

తే. ఎట్లయిన నీదుప్రేమ యీయిరువురందు [నో?
సమ మగునొ కాదొ చెప్పుమా చాలఁదడవు
వీరిఁ బోరించి? తవ్వేడ్క విరియఁ జిమ్మ
లేక కనుఁగొంచు నుంటి నే నాకసమున." 212

క. "అనుటయు "నే నెక్కడ వీ
రిని బోరించితి నయో విరించితనయ! నా
కును వీరలసమరూపత
యును బోరును వెఱఁ గొనర్చుచున్నది మిగులన్." 213

వ. అని పలికి మున్ను దా నందు నొక్కరంభఁ గూడి క్రీడించు
[1]చుండి యప్పుడనతిదూరంబున వనితాకృతం బైనయాక్రంద
నంబు వినంబడినఁ గారుణ్యసంభ్రమంబున నద్దిక్కునకై చను
టయు, నంతం దనదృష్టిపథంబునం బలాయమానుండనగు
నన్నుం దఱిమి పట్టుకొని యొకకొంతదవ్వు దిరుగఁ గొం
పోవుటయు నచ్చటికిఁ దనకాంత గూడ వచ్చుటయుఁ
దత్ప్రార్థనంబున నన్ను విడిచి యిచ్ఛావిహారంబుల నదియుం
దానుఁ గొంత ప్రొద్దుపుచ్చుటయు నంత రెండవరంభ వచ్చు
టయు దానివచనప్రకారంబును గలహాభంగులుం జెప్పి
యానలకూబరుం డాయిద్దఱు రంభలయందు. 214

1. చున్నయెడకనతి.

సీ. తా నటమున్న క్రొత్తగఁ దీర్చినట్టిక
స్తూరికాతిలకంబుసొంపుతోడఁ
గన్నెగేదఁగి ఱేకు లన్నువగాఁ గొనల్
గాన్పింప నిడినకీల్గంటుతోడ
బంగారుపస మించుపసనిపుప్పొడి రేఖఁ
జూపట్టుపాపటసొబగుతోడ
సరివాటు గాఁగఁ గేసరములు గ్రుచ్చిన
కురువిందవిరిగుబ్బసరముతోడ
తే. నొప్పు మీఱుచు నున్నట్టియొకతెఁ జూపి
"యీ సరోజాయతాక్షియు నేను నున్న
చోటి కింతకము న్నావధూటి వచ్చె"
ననుచు రెండవయింతి నమ్మునికిఁ జూపె. 215

ఉ. చూపిన నాలతాంగి యజసూనున కంజలి చేసి 'యోమహా
తాపస! యెల్లనాఁడు మము ద్వారకచేర్పున నాడినట్టి మీ
యాపలు కింతచేసె' నన నన్వ్యయు నట్ల యనన్ మునీశ్వరుం
డాపుపుఁబోండ్ల నిద్దఱ 'యథార్థము పల్కితి'రంచు నవ్వుచున్.

క. "ఆమాటలు సరిదాఁకెఁ గ
దా! మా కీవీక్షణోత్సవాతిశయంబున్
బ్రేమమునఁ జూడఁగల్గెను
వామేక్షణలార! పోయి వచ్చెద నింకన్." 217

క. అనుటయు నలకూబరుఁ "డో
మునివర! యిద్దఱ యథార్థముగఁ బల్కితి రం
చును బల్కితి రెట్లొకొ యిది
వినవలయుం దేటపఱచి విచ్చేయుఁ" డనన్. 218

సీ. నాఁడు తా నాత్మసౌందర్యవైభవపతి
వాల్లభ్యమహిమగర్వమున నాడు
కొనువాక్యములు నేను వినలేక సవతి యే
గతిఁ గల్గునో మీఁదు గంటివె యని
నట్టిమాటఁ దలంచి యాపలు కింతసే
సె నటంచుఁ దార్కాణసేసె నొకతె;
యొకతె రంభారూపయుక్తిచేఁ బ్రియుఁగూడఁ
గాంక్షించి యొకకార్యఘటనవేళ
తే. నాదియందును నాచేత నదివరముగఁ
దనకు నిచ్చితి ననిపించుకొనుట యిపుడు
హృదయమున నిల్పి యాపలు కింత సేసె;
ననుచుఁ దార్కాణ సేసె రెండును నిజంబు. 219

క. నా విని యిపు డీభావం
బీవనితకు నీవనితకు నిది యనుచు బయల్
గావించి తథ్యమిథ్యా
భావంబులు మీర లేరుపఱుపఁగవలయున్. 220

క. నావుడును "దథ్యమిథ్యా
భావంబుల కేమి? నీకు భావింపఁగ స్వా
భావికమే యీయాకృతి
భావము? నిజ మెద్ది యీప్రపంచమునందున్. 221

క. నీ పట్టురువడ నొక్కతెఁ
జూపి యొకతె గర్వ మడఁచుచుం వలయుగతిం
బ్రాపింపవచ్చు భోగము
నీపుణ్యం బినుమడించి నేఁడు ఫలించెన్." 222

ఉత్సాహ.—

అనుడు నోమహాత్మ పెద్దలైనవారిఁ దడవుగా
నునిచి యిట్టు నట్టు పలుక నొప్ప కేమి వచ్చునో?
చనుఁడు నిలుప వెఱతు ననినఁ జనియె నాతఁ డట్ల యా
ననుచు నుచితలీల నుండు మనుచు నల్ల నవ్వుచున్. 223

సీ. అర్థేశనందనుఁ డంతట నెప్పటి
తనపువ్వుఁబోఁడి కైదండఁ గొనుచు
'నిది యెంత లేదు నెమ్మది నిట్టివిఘ్నముల్
గుఱిచేసి మనకేలి మఱవనేల?
ర'మ్మంచు రెండవరంభఁ గనుంగొని
'నీ వెంతనేర్పులు నెఱపితేని
మాయలే యని తోఁచు మాకుఁ గావున నీదు
సత్య మెఱింగింపఁ జాలినట్టి
తే. సాక్షిఁ దెమ్ము పొ'మ్మని తిరస్కారసరణి
దోఁపఁ బలికెఁ దాత్కాలిక దుర్నివార
మారకేళీకుతూహలమహిమచేత
నెచటి కేనియు నపుడు తా రేగఁ దలఁచి. 224

ఉ. ఆసుదతిం గనుంగొని తదంగన యప్పుడు హెచ్చినట్టి పే
రీసున నీసడించుచు "నోకించుక నీకును సిగ్గు లేదొకో!
దోసము గాదె యిద్దఱు వధూవరు లేకత మున్నచోటికిం
డాసిన? నిట్టియాసలఁ గడంగిన నేమని చెప్పు! నావుడున్.225

వ. ఆరంభ యమ్మాటలకుఁ గడునలిగి రోషకషాయితవీక్షణంబుల
నాపక్ష్మలాక్షి నీక్షించి. 226

శా. "ఓసీ నీకొఱఁగామియే యిది నిజం బూహింప కిట్లంగజ
వ్యాసక్తుం డగునాథుచేష్టితము గాఁ గైనం గుబేరుండు లేఁ
డో సుత్రాముఁడు లేఁడొ పద్మజుఁడు లేఁడో ధర్మపుంభ్రాపు లే
దో సత్యంబును నిల్పు నింతన కడుం దుర్లింగ నీ కేటికిన్?"

క. అనిన విని నాయకాదర
ఘనగర్వము [1]నిరసనంబుఁ గడుఁ జిత్తములోఁ
దనరఁగ నప్పలు కించుక
యును గైకొన కవ్వధూటి యుద్ధతిఁ బలికెన్. 228

క. అఱపు లుడిగి పోపో నీ
యఱచేతం బండ్లు వచ్చినప్పుడు మమ్ముం
గఱచెదవు గాని తగునెడ
మొఱయిడు మది యెట్టిదైవములు వినియెడినో. 229

వ. అనుటయు. 230

క. "కానిమ్ము వేగిరింపకు
నీనుడుటనె ప్రొద్దు వాడిచెనే యేదైవం
బైనను విన? కిప్పుడ యిదె
నానిజ మేర్పఱచి నీ కొనర్చెద శిక్షల్." 231

వ. అని పలికి యచ్చోటు వాసి కొన్ని యడుగు లరిగి యంతటఁ
దనకోపంబును మించి దీపించు ప్రియవియోగదర్పితానల్ప
కందర్పహేతిఘాతజాతచేతస్తాపంబున కోపక యాపడఁతి
కడుం గృశించి గళితకంకణ యగుచు నిలిచి యొక్కయుపా
యంబు చింతించి తిరిగి వచ్చి యిట్లనియె. 232

1. నీరసంబు.

క. "నీ విచ్చో మెఱెయత వై
కావరమున వలసినట్లు గయ్యాళింపం
గా వెఱచి [1]పెద్దమొఱ గా
నే వీరిని వారిఁ దగిలి యేల వచింతున్. 233

క. నీవును ఈ ర మ్మిప్పుడు
దేవసభం దేఱి యేగు దెంత" మనుచుఁ దా
నావనజాక్షిని డగ్గఱి
తీవరమునఁ గొంగుపట్టి తిగిచెం గినుకన్. 234

చ. తిగిచినఁ "జూచితే నిను మదిం గణియింపక యెంతసేతకుం
దెగియె భయంబుదక్కి వెనుద్రిమ్మరిరక్కసి గాక భూమిలో
మగువయె యీగయాళి? ప్రథమంబున నోర్చినతప్పు సూవె
యీ, పగిది ఫలించె ?" నంచుఁ బ్రియుఁ బల్కెఁ గరం బది
సంభ్రమించుచున్. 235

క. పలికిన "మన కేమీ? విబు
ధులసభలోపలన తనదుదుండగ మెల్లం
దెలిపి తగుశిక్ష చేయుద
మలిగి యిపుడు పదర నేల?" యని యతఁ డాడెన్. 236

తే. అంతఁ బ్రతిరంభ చూచి "నీయాత్మలోన
నింత యుండిన నీ[2]సత్వ మెఱుఁగవలయుఁ
దిరుగఁబడినను విడువఁ జూ! దేవసభకుఁ
బద" మనుచుదానిఁ గూడి పోఁ గదలుటయును. 237

వ. కొంత చింతించి యతనికాంత యతని కిట్లనియె. 238

1 పేద. 2. సత్య.

సీ. అప్సరస్త్రీలలో నగ్రగణ్యత్వంబు
జగదుపశ్లోకితంబుగ వహించి
యూర్వశీమేనకాద్యుత్తమస్త్రీలు రా
వమ్మ పోవమ్మ నా నతిశయిల్లి
యెన్నండు నెచ్చోట నేవారిచే వ్రేలఁ
జూపించుకొనక ప్రస్తుతికి నెక్కి
నలకూబరుండు ధన్యతరుండు నా గఱు
వతనంబుచే నీకు వన్నె దెచ్చి
తే. యొప్పు[1]నే యింకఁ గడపట నిప్పిశాచి
నాకు సరిచేసికొని దేవలోకసభను
"నీవు సూ నీవు సు!" మ్మని యేవిధమునఁ
గలహ మాడెద? నిది నీవె తలఁచిచూడు! 239

క. కోపము పాపమునకుఁ బొ
త్తీపెనుదగవునకుఁ దగఁగ నేతిట్టాటల్
ప్రాపించునో? పడంతుల
కోపురుషశ్రేష్ఠ యివియు నొక్క బ్రదుకులే? 240

వ. అదియునుం గాక. 241

క. "రంభకు సహాహా యొకప్రతి
రంభ గలిగి తిగిచి తెచ్చె రచ్చల!" కనిసం
స్తంభింపనీరు హాస్యా
రంభణ మిాపోరు నిర్జరవిటుల్ నగుచున్. 242

క. నానడకలకును యోగ్యము
కానిది యిపు డిచట [2]నైనకలహము బ్రదుకే

1. నేనింక. 2. నైనఁగల.

ల్లైన నగుఁ గాని యిఁక నీ
యాన ధరణి విడిచి దివికి నడు గటువెట్టన్. 243

క. ఈకలహ మపుడ వినఁబడు
నాకంబున సురల యాననము లేగతి నా
లోకింతుఁ? దెగినఁ దెగనీ
నాకు మరుఁడు నిన్ను [1]నిలు మనఁ డాకునికిన్." 244

వ. అనుడు రెండవకొమ్మ యమ్మాటలాకర్ణించి యోకాంతుండ! యీకాంత నేర్పు చూచితే! వేల్పులకడకు నేతెంచినఁ దన మాయ బట్టబయలంబడు ననయెడఁదలంపున రాఁగూడక సురలయాననంబు లేగతి నాలోకింతు? నని నాకగమనంబు పరిహరించె; నందును ధరణి విడిచి దివికి నడు గడువెట్ట నని తోడిఁబడ నీమీఁది యాన పెట్టుకొనుట [2]ఖేచరత్వంబు కలిమియు సందియంబ. ఇంతతడవు ప్రియకాంత యనుచు నెట్లు నమ్మి? తని పల్కిన నది వివేకమార్గంబ యగునని నలకూబరుండు తద్వాక్యంబులకు నిరుత్తరయైయున్నతన దండ చెలువ నుండనీక యోసి మాయలాడివిగదే! యని మెడపట్టి పాయంద్రోయుటయు నదియ సందుగా నాయిందు ముఖి [3]యందంద దట్టించి 'యిట్టివెడనేఁతలచేత నాథుని కెడ నేసి చేతోజాత హేతిఘాతంబులపాలుపఱచి తని పలికి యాతరళాక్షిని హేతిఘాతనిమిత్తంబు చేతన కాయవియో గంబునొందు మని శపించె.' నలకూబరుండును దత్కాల(గుణ)ం బెట్టిదియొకాని యాఁగాములు వివేకింపలేక యిది యిట్టి

1. నేలుమన. 2. వివేకింపఖేచ. 3. నందంద.

[1]శాపంబునకుఁ దగునని పలికి "యోసి నీపే రెద్ది? యెట్టి
దాన?" వనియడిగె నప్పుడు తత్ప్రతిరంభ సైరింపక. 245

శా. "ఇందాఁక న్నినుఁ జేరనీక నను న క్లింతే మనోజవ్యథన్
గుందంజేయుట చాల కే మడిగె దీగొంటున్ వృథా"
యంచుఁ "నా, కందర్పత్వరఁ గానలే" వనుచు నాకంజాక్షిఁ
బో ద్రొబ్బెఁదా, నెందున్ నిల్వఁగనీక పేరలుకతో నెంతేఁ
గడున్ దవ్వగన్." 246

వ. అని చెప్పి యాసిద్ధుఁ డాసుముఖాసత్తి కి ట్లనియె. 247

తే. "అట్లు పోద్రొబ్బుటయు నతఁ డాత్మ నిచ్చ
గించుకొని యుండెఁ గాని తా నెంచఁ డయ్యె
రంభ యాఁగాము లా ప్రతిరంభ మీఁది
ప్రేమఁ "గాముకుల్ నూతనప్రియులు గారె?" 248

క. అనుటయు "నీ వం దేయిం
తిని సత్యపురంభ యనుచుఁ దెలిసితి? వాలా
గున భంగ మొంది యూరక
చను టరయఁగ నదియ కపటసతి గావలయున్. 248

క. త న్నట్లు పలికి ద్రొబ్బఁగ
మిన్నక చన నంత నోరు [2]మెదపక యది యా
ము న్నాడినమాటలబిజు
సెన్నఁగ? [3]నిది గనియె యతఁ డుపేక్ష యొనర్చెన్. 259

క. అది యట్టిద కాని మ్మా
తుద చెప్పుము సిద్ధపురుష! తొల్లి యెచటఁ గ

1. శాసనంబునకు. 2. మెంగయె. 3. నది.

న్నది విన్నదిగా దద్భుత
మిది వినవలయు" నన నాతఁ డిట్లన పలికెన్. 251

సీ. "ఇటమీఁద నింక నొక్కటి యద్భుతము విను
మోపయోజానన! యాపదంతి
నారీతి నెంతయు దూరంబుగాఁగఁ బో
ద్రొబ్బి యేతెంచి యాతోయజాక్షి
ప్రియుఁ జూచి "మగవారిప్రేమ లిట్టివిగదా!
యెట్టు నమ్మఁగ వచ్చు నిచ్చలోనఁ?
బ్రాణేశ యటు దండఁ బాసినమాత్ర నీ
ద్రిమ్మరి నెచ్చోటఁ దెచ్చుకొంటి?
తే. నిన్ను నే మన నున్నది నిరభిమాన
గుణత నినుఁ జేరు నన్నను కొనుట గాక?
నాకునా యిన్నిపా!" ట్లంచు నాకులమతి
నడలెఁ గన్నుల బొటబొట నశ్రు లొలుక. 252

చ. అడలిన నాదరంబునఁ దదశ్రుజలంబులు కేల నొయ్యనఁ
దుడుచుచు "నాయెడం గలదె దోస మొకింతయు నెంచి
చూడ నో, పడఁతుక? దాని నీవ యనుభ్రాంతిఁ గరం బిటు
[1]లాదరించి యే, ర్పడినఁ బరిత్యజించితిని బట్టఁగరా దిది
తప్పుగా మదిన్. 253

మ. అని యింతిన్ నలకూబరుం డురముతో హత్తించుచున్
దుఃఖ మార్చి నికుంజంబునకున్ రతిక్రియకు నై చేర్పంగ
వేతొక్కఁ డం,తన వచ్చెన్ నలకూబరుం డచటికిన్ "నా

1. లాచరించి.

రూపముం దాల్చి వంచన నెవ్వాఁడుర చేరినాఁ [1]డిట
దురాశఁ రంభ?" నంచుఁ వెసన్. 254

తే. ఇట్లు వచ్చినఁ గనుఁగొని యేను మిగుల
నుల్లమున వెఱఁ గందితి "నొకటివెనుక
నొకటి రాఁ జొచ్చె మాయ లీయుర్విమహిమ
తెలియఁగు గాదు గదా!" యని ధృతి చలింప. 255

సీ. అ ట్లేగుదెంచుచో నతని గన్గొని రంభ
బెదరు నాశ్చర్యంబు మది జనింప
విభున కి ట్లనియె "వల్లభ! యిది యొక్కమా
యా ప్రపంచము చూడు మద్భుతంబు!
నీదురూపముఁ దాల్చి భేద మొక్కించుక
యును లేక కాన్పించుచున్న వాఁడు
తనదురూపము నీవు ధరియించినాఁడ వం
చున్న వాఁ డిది గెల్వ యుక్తిచెపుము

తే. యపుడు నారూపుతో నది యన్ని వెతలఁ
బెట్టి నది గడచితి" మన బెట్టిదముగ
నిపుడు నీరూపుతోడ వీఁ డేగుదెంచెఁ
దిరుగఁ డొకమాత్రమున వచ్చుబిరుసు[2]ఁజూడు. 256

క. మనయభిమతఖేలనముఁలు
మనమున సైరింప కిన్నిమాయ లకట యే
దనుజుఁ డొకో మాత్సర్యం
బొనరఁగఁ జలపట్టి పన్నుచున్నాఁడు కడున్." 257

వ. అని పల్కుచుండ. 258

---

1. డఁట. 2. చూడ.

శా. అంతం జేరఁగ నేగుదెంచి యతఁ "డోయబ్జాక్షి! యే
మంచు వి, భ్రాంతిం బల్కెదు కల్లయున్ నిజము వీడ్పా
టొందఁగా? నిప్డు నీ,కాంతున్ నన్నుఁ బరిగ్రహింపుము
మదాకారంబు వీఁ డెవ్వఁడో, యెంతే నొప్పుగఁ దాల్చి
వంచితవు నీ వేతన్మహామాయ చేన్. 259

మ. మది నామాటలు నమ్మవేనియు నిఁకన్ మమ్మిద్దఱన్ ధైర్యసం
పద పెంపారఁగ దవ్వులన్ నిలిచి యోపద్మాక్షి వీక్షింపు మే
నిదె ఖండించెద వీని మామకమహాహేతిప్రకాండంబుచేఁ
దుదశోధించెదుగాని నీకుఁగలయుక్తుల్ మీఱనాసత్యమున్."

చ. అన విని చాలఁ దల్లడిలి యాయక నాయకుకంఠమున్
రయం,బునఁ దనకౌఁగిటం బొదివె "భూరికృపన్ ననుఁ
గానరే ప్రియున్, మనుపరె వేల్పులార యొకమాయపు
రక్కసుఁ డాక్రమించి తాఁ, దునుముచు నున్న వాఁ
డలుకతోడ నిరాయుధు" నంచు నేడ్చుచున్. 261

చ. అది గని వాఁడు నవ్వి "యిది యేఱ వివేకము? గట్టిగాఁగ న
న్నె దనుజుఁ జేసితే ముగుద! నీవు దలంకకు నే నిరాయుధున్
మదమఱి పాఱువానిని బ్రమత్తునిఁ జంపెడువాఁడఁ గాను'నా
కెదిరిచి నిల్చునో' యనుచు నీతినిఁ ద్రుంచెద నంటి నిత్తఱిన్.

వ. ఎదిరించి నిల్వనోపునేని, తనకైదువెచ్చుట నున్నది?
తెచ్చుకొమ్మను; మోకొమ్మ నెమ్మనంబున నితండ
'నిక్కపునలకూబరుం' డనియు, యుద్ధంబున జయాపజయంబు
లెంచినట్టురావు; తోడింబడ నితని కొక్కటి యయ్యేనేని
యే నేమి యగుదాన?' ననియు విచారించితేని నితనితథ్య

మిథ్యాభావంబు లేపడునందాఁక నేను యుద్ధంబునకు వేగిరింపక సహించెద. ఇంకను మాయిరువురవాక్యప్రకారం బులు వినియు, నీవెఱింగినపూర్వరహస్యంబు లడిగియు, మఱియు నుచితమగుతెఱంగులవలన మాకపటాకపటవర్త నంబులు దెలిసికొనుము. నాకుం బ్రియవనిత వైననీవు నాయెదుటన యిట్లు [1]పరునిఁ గంఠాలింగనం బొనర్చియుండ నిచ్చలోన మచ్చరంబు పెచ్చుపెరుఁగక యుండదు. పెచ్చు పెరిఁగెడు మచ్చరంబు సత్యాసత్యవివేచనపర్యంతంబు నిలువ కెట్లొనర్చునో యెఱుంగరాదు; కావున నాత్మహితంబుఁగోరి తేని [2]యతని విడిచి యెడగలుగ నిలిచి నాపలుకులు విను" మని పలికిన. 263

క. ఆచెలువ తనదుప్రియునిం
గాచుకొనఁగ నప్పు డదియె గతిగా మదినా
లోచించి చూచి మఱి త
ద్వాచాగతి నతని కెడగఁ దాఁ జని నిలిచెన్. 264

క. అతఁడు "నోతొయ్యలి యిపు
డీతనియీఁకత్తి గిత్తి యేను గణింపన్
భీతిలకు మన్న మానవు
భీతప్రకృతి" వని యెప్పెఁ బ్రియ యటు చనఁగన్. 265

శా. ఆరీతిం గడ కేగి తా నిలిచి ప్రేమాంచత్కటాక్షంబులన్
ఘోరాసూయనిరీక్షలన్ వరుసఁ గాంతున్ దత్సమాకారు న
న్నారీరత్నము చూచుచుండె నెచటన్ వ్యర్థంబు లత్యుజ్జ్వలా
కారశ్రీసమతల్ జనించు ననురాగంబుల్ మమత్వంబుచేన్.

1. పరునికంఠా. 2. యితని.

సీ. రెండవనలకూబరుం డంత రంభఁ గ
   న్గొని "చెల్వ భావించుకొనుము నీవ
యమరేంద్రుఁ డంప నిం దరుగుదెంచితికద
   మణికంధరునితపోమహిమఁ జెఱుప!
నతని నేచెట్లఁ గట్టితి? వీతఁ డెచ్చోట
   లంకించుకొనియె నలంఘ్యమైన
విరహతాపంబునఁ బొరలుచు నీరాక
   కెదురుచూచుచు నున్న డే నటుండ?
తే. నకట! సురకార్యవిఘ్న[1]మోయనుభయమున
వెంట రా లేనిపాప మివ్వేతలు దెచ్చెఁ
దేరకాఁ డిట్లు నిన్ను భ్రాంతిని బొరల్ప
బాస సేయంగవలసె నే భర్త ననుచు. 267

మత్తకోకిల.—
వెంట వచ్చిన నీవు నాపయి వేడ్కఁ జిక్కి తపక్క్రియల్
గెంటఁ జేయ నెఱుంగ కుండినఁ గీడు వాసవుచేత నే
వెంట రా కటు నిల్చినన్ ననవింటివానికిఁ గోప మీా
రెంటఁ జింతలు కొంత ప్రొద్దొనరించినన్ బిరువీఁకుగాన్. 268

మత్తకోకిల. అంతఁ గంతునిపంత మెంతయు నంతకంత కనంతవి
క్రాంతిఁ బర్వఁగ నోర్వ "కెట్టటు కాని యింద్రునియల్కసై
రింతు" నంచును సాహసం బొనరించి యే నిటు వచ్చితిం
గొంత వెండియు నింద్రు నెంచుచుఁ గొంచితిన్ నినుడగ్గఱన్.
చ. "తపసితపక్క్రియల్ చెఱిచి దైవతకార్యము నిర్వహించి నీ
వెపుడెపుఁ డేగుదెంతు; నిను నెప్పుడు కౌఁగిటఁ జేర్తు"నంచు నే

1. మానను.

నపరిమితాశ నోజలరుహాసన యిట్టనిచేరువం బ్రియా
సపడుచు నిల్చుకొంటిఁ బికసంచయపంచమవంచితాసువుల్.

క. ఇక్కడ నిను వీఁ డెవ్వఁడొ
యిక్కరణిఁ మోసపుచ్చి యేలుకొనంగా
నక్కట వలవనిశంకల
నక్కడ నే పాడుకాపు [1]లాగతి నుంటిన్. 271

ఉ. ఇంతకమున్న నారదమునీశ్వరుఁ డచ్చటి కేగుదెంచి "నీ
వెంతయు మన్మథార్తిఁ బడి యేమిటి కిచ్చట నున్నవాఁడవో
భ్రాంతుఁడ! నీదురూపమున రంభ నొకం డవలం గరంబు వి
భ్రాంతినిముంచుచుం వివిధభంగులనేలుచునున్నవాఁ"డనన్.

క. విని వచ్చితి "నేసమయం
బున నేగతి సందుకొనియెఁ బోలఁతుక యితఁ? డీ
తని తెలుఁగుఁ జెప్పు" మన "నే
మనిచెప్పెద" ననుచుఁ జూచె నదిప్రియు మొగమున్. 273

తే. చూచుటయు "నేమిచూచెదు శోభనాంగి?
నిన్నుఁ జెందినపాల్లిన్నఁ జెంద
కుండునే నాఁటియలనారదోక్తి యరయ!
నాఁడు నీతోడ నమ్మునినాయకుండు. 274

క. "నినుఁ బోలువనిత నీకును
వనజముఖి! యితనిఁ బోలువాఁ డితనికి నెం
దును గలిగి కలంచునొ! యి
ట్టినిగాఢపుసొంపునుదము లీవులు చనునే?" 275

1. నాగతి.

క. అని పలికెఁ గాదె! యది వృథ
చనునే? యైనను లతాంగి శంకింపకు నీ
మనమున నీగతి; నిప్పుడ
తునిమెద నాఖడ్గమునను దుర్దమలీలన్. 276

వ. ఆఖడ్గం బపు డల్లయచటి కేళినికుంజంబునం బెట్టినవాఁడ; నిదె తెచ్చుకొనియెద నని పోవం జూచినఁ దత్ప్రతిభటుండు "నీ కింతబీరంబు గలిగినం బోరు దూరంబుచేసి యిటు నటుం జననేల? నిరాయుధుండ నంటేని నేను నాయుధం బిదె విడిచితి నని విడిచి యడ్డంబుగా నడిచిన బెడిదంపుటీరసంబును వీరరసంబును ఘోరంబులగుచు నుల్లసిల్ల మల్లయుద్ధం బాయిద్దఱకుం దద్దయుం బ్రవర్తిల్లె; నప్పు డొండొరుల యుద్దండదోర్దండ చండాస్ఫాలనాభీలఘోషవిజృంభణంబులు కుంభినీధరగహ్వర[1]రసముద్ధత ప్రతిధ్వానంబులచేత నినుమడించి ప్రళయజలధరవర్గనిర్గళితంబు లగుబలుపిడుగుల మ్రోత ననుకరింప నిశ్శంకనిరంకుశాహంకారహుంకార గంభీరారావంబులయార్భటులు [2]నిర్భరసముద్భటంబులై దిగ్భిత్తులఁ బిక్కటిల్లుచు వ్రక్కలింప నొక్కరొక్కరి మిక్కుటపువిక్రమంబుల పెక్కువ లెక్కగొననియక్కజపుఁబేరుక్కున మిక్కిలి పేర్చునిచ్చలపుటగ్గలికలఁ దగ్గుమొగ్గు లేక డగ్గఱి యాగ్రహంబు నెఱప [3]నొడ్డారించుచు గడ్డుటుక నీక యడ్డంబుగా నొడ్డుకొనియెడు నెదిరిపిడికిలి వాయం దట్టి బెట్టిదంపుటురువడిం దొడింబడఁగఁ దీసి కీలాగరిష్ఠనిష్ఠురముష్టిఘాత ప్రయోగనైపుణంబుల దీపించుచుఁ గోపంబున నేపు

1. సముత్థిత. 2. నిర్భట. 3. నొడ్డాణించుచు.

దూఱెడునాటోపంబులనాఁపరానియ నూనంపుబిరుసునుంబరు
సఁదనంబును హెచ్చఁ జెచ్చెరఁ జొచ్చి పట్టికొని హెచ్చరికం
గచ్చు వదలక పెరిఁగెడి[1] యచ్చలంబును బలంబును బ్రబలంబుఁ
జేయ గళంబుల ముంజేతు లిడి పెడమఱ నొక్కి ఱెక్క
విఱిచి పడవైచుచుఁ, [2]బడవైచిన విడువక తోడన పరునిం
బడం దిగుచుచుఁ, దిగిచిన బిగి వదలక పయింబడి కదల మెదల
నీక పొదివి పట్టుచుఁ, బట్టిన నిట్టట్టు పెనంగి పట్టువదలించి కరం
బుల నురంబులనడిమి కిమ్ముడించి యొడముకొని బడిబడిం
బొడుచుచుఁ, బొడిచినఁ బొడువనీక కడిందికడిమి నడంగంబట్టి
పగతులచేతులు తొడల నిఱికి పరాక్రమించుచుఁ, బరాక్ర
మించినను విక్రమంబు దక్కక పెనుకటిదట్టికట్టు పిడికిటఁ
దొడికి యెత్తి తెలిపిగొని పఱపి మోకాళ్లు వక్షస్స్థలంబుల
నాని వెల్లకిలఁ ద్రెళ్లబిళ్లమీటుగాఁ జిమ్ముచుఁ, జిమ్మిన ముమ్మ
రపువేగంబుతోడఁ దోడన లేచి పైఁబడఁ గడంగిన నెడయీక
పదంబులు చాఁచి యెదు రొడ్డుచు, (నెదురొడ్డిన) నఱిమిఱి
నొక్కింత తఱిఁ గని యద్భుతరయంబున దిగ్గన లేచి మెడ
యొడిసిపట్టి గ్రుడ్లు వెలికుఱుక నొక్కుచుఁ, నొక్కినఁ జిక్కు
వడక యొకకేలఁ గోకకట్టు నొక్కకేలఁ దొడయుఁ బట్టి
తూలవైచి మఱియు మల్లచఱచి క్రమ్మఱ [3]లెమ్ము రమ్మని
గర్జిల్లుచు, గర్జిల్లిన నూర్జితరయంబున మగుడఁ దలపడి పౌరు
షంబు సేయుచు, వెండియుం [4]బాయుచు డాయుచు ననేక
ప్రకారంబులఁ బోరుచుండ. 277

1. యచ్చలంబులు బలంబును. 2. వైచియుఁ. 3. లెమ్ముహుమ్మని.†
4. బాయుచులాయుచు డాయుచు.

ఆ. అట్టియెడను బచ్చపట్టుదట్టీచేత
నొప్పుతనదుప్రియుని నుజ్జ్వలంపు
ఠీవి నెఱపు చంద్రకావిదట్టీచేతఁ
బరుని గుఱు తెఱింగె సురవధూటి. 278

క. ఇక్కరణి నించుకంతయు
నెక్కువతక్కువలు లేక యిరువురు సరిగా
నుక్కునఁ బోరాడి శ్రమం
బెక్కుడుగాఁ జేసి నిలిచి రెడఁగా నంతన్. 279

ఉ. రంభయు వారిరూపు ననిఁ బ్రౌఢియుఁ దుల్యతఁ బొల్చి
సంశయా,రంభ మొనర్ప నెవ్వరిఁ దిరంబుగ నమ్మ "కహో
నిలుండు సం,రంభము మాని యే నడుగు ప్రాక్తనవర్తన
మొక్కటిఁ రహ,స్సంభవమైనదాని వరుసఁ వచియింపుఁడు
మీర లిత్తఱిన్. 280

క. దానఁ సత్యాసత్యత
లే నామతిక్రొలఁది నిశ్చయించుకొనఁగ నె
వ్వానికి నెయ్యది యుచితం
బానియతి నతండు పోవు టర్హం" బనియెన్. 281

వ. అని యావనిత యాడుమాటకు వార లీయకొన నిద్దఱిం
బాయం బాయఁ బిలిచి యొకఁడు వినకుండ నొకనితోడ
"మనకుఁ దొల్లి కళాపూర్ణుం డనువాని ప్రసంగం బెచ్చట
గలిగెఁ? దత్ప్రకారం బేమి నీవు వింటి?" వని యడుగుటయు
నందు ద్వితీయుండు దానికి సమ్మతంబుగా నుత్తరంబిచ్చెఁ

స్థలిఁ దరళమౌక్తికము కలఁగి హృదయంబువెలిఁ
దోలఁకిపడుసత్త్వమున వెలుఁగు నటియింపన్. 143

ఉ. త్మారమణుం గనుంగొనఁగ గాటపువేడుకఁ బొలుదెంచె నో
యార్యరియుక్తమార్గ జలక మాడుచు వైచినకీలుగంటు దా
సారెకు జంఘలం బెనఁగ సవ్యకరంబునఁ బాయఁ బట్టి శృం
గారరసంపుగిండి గలకాముని యూడెపుఁగత్తెయో యనన్.

తే. ఇత్తెఱంగునఁ బౌరుల కెల్ల నేత్ర
పర్వ మొనరించు రూపవైభవముతోడఁ
గ్రముకకంఠోత్తరమహాపుర ప్రవేశ
మాచరించి ఘనైశ్వర్య మతిశయిలఁగ. 145

క. శుభతర మైనవిపంచిక
యభినవకౌముదికి నొసఁగి యాత్మసచివు న
వ్విభుఁడు నియమించె రూపా
నుభూతిజకు నూపురములనుం జేయింపన్. 146

వ. దానం జేసి యమ్మానవతియు నానందంబు నొందుచు నెందు నత్యపూర్వంబులైన నానాభూషణవిశేషంబుల నలంకృత యగుసమయంబునఁ బ్రసంగవశంబునఁ జెలులవలన నాత్మ బాల్యసమయసంప్రాప్తరత్నహారంబుసుద్ది విని ప్రాణవల్లభుని ప్రథమానుగ్రహవిశేషంబైన యాభూషణంబు ధరియించుటకు నభిలాషంబు వొడమ దానిం దెప్పించి నిజహృదయస్థల లంబియగుటకుఁ దగినట్లుగా నిరుగడలఁ గొన్ని మణులు నిలిపి నూతనసూత్రంబునం గ్రుచ్చి ధరియించి యంచితవిలాసంబు పరిఢవిల్ల నురఁటి గొని వరునికడ కరిగి పరిచర్య సేయుచుండె నంత. 147

సీ. ఆయితంబుగఁ జేసినట్టియందియజోడు
సత్వదాత్ముఁడు కరాబ్జమునఁ బూని
యచ్చటి కేతెంచి యధిపు కన్యామసంజ్ఞ
నయ్యింతియగ్రంబునందుఁ బెట్టి
స్వామి నీ కొడఁబడ్డ సకలదిగ్గేశభూ
నాథశుద్ధాంతకాంతాశిరోమ
ణిప్రకల్పితనూపురప్రకాండము లివె
యంఘ్రులఁ బూను మా యమ్మ యనుచు
తే. వసుధఁ జాఁగిలి మ్రొక్కిన వలదు వలదు
మ్రొక్క నాకును వందనార్హుఁడవు నీవు
మేనమామ వెలుంగముగాని నేఁటి
దాఁక నిది యంచు నతని కాతరుణి మ్రొక్కె. 148
క. మ్రొక్కిన నతఁ డరుదందుచు
మిక్కిలి వెనువెన్క కొదిఁగె మేను వడంకన్
నిక్కం బిది సంకోచము
దక్కు మనియె సతియు లేచి తగువినయమునన్. 149
వ. అప్పుడు కళాపూర్ణుండు నవ్వుచు నతనిం జూచి యా చెలువ యన్నట్లు నిజంబుగావలయు సంకోచం బేల, తత్ప్రకారంబు తెలియ నడుగుటగాక యని యిట్లనియె. 150
తే. తనదుశైశవమున నీవు తను నడిగిన
నీకులాఖ్యాదు లింతికి నేఁడు తోఁచె
నేమొ? మే లయ్యెఁ దెలియుద మిప్పు డడిగి
యనుచు నాపువ్వుఁబోఁడి యాననముఁ జూచి. 151

---

1. జైన. 2. తన.

ఉ. నీదగుచిన్న నాఁటియలనిర్మలబోధవిశేష మిద్దు ల
ద్భోదయ మయ్యెనో తిరుగ నుల్లములోనఁ నితండు నీకు నో
పైదలి మేనమామ యగుపద్ధతి యె ట్లగు నేఁడు చెప్పవే
ట్లాదట నాఁ డితం డడుగ నప్పుడు చెప్పమి యెట్లు చెప్పవే.

వ. ఆశైశవంబున నట్టివిజ్ఞానంబు గలుగుటకుఁ గారణంబు నాఁ
డడిగి తెలిసికొనలేమికిఁ బశ్చాత్తాపంబు నొందుచుండుదు;
నది యెఱింగింపవలయు. 153

క. అన విని యాసతి యంతయు
వినిపించెద వినుఁ డటంచు విభునకు లీలం
దనచేతిసురఁటి విసరుచు
వినయమధురభణితి నిట్లు వినిపించెఁ దగన్. 154

సీ. అధిప ము న్నితఁడు మహారాష్ట్ర దేశ మే
లెడుసుగ్రహుం డనుపుడమిఱేఁడు
మాతల్లి రూపానుభూతి యాతని[1]యప్ప
యితనికులీనత కెల్లనృపులు
కడు వేడ్కపడి తమకన్నెల నిచ్చి సం
బంధబంధువులుగాఁ బ్రణతనిష్ఠఁ
బత్రిక లంప నంపఁగ నిందు నెవ్వారి
వాంఛ యీడేర్తు నెవ్వారిని విడుతు

తే. ననువిచారముతోడ నిట్టటు నుడువక
గడపె బహుకాల మది యవగణన గాఁగ
నగచి యొక్కొక్కనెపమున వారు మేరఁ
దప్పి యితనిపైఁ జేసిరి దండయాత్ర. 155

1. యువ్వ.

క. ఈతఁడు దా వెలుపల రై
యే తెఱఁగున నైన వారి యే పడఁచి పరా
భూతులఁ జేయుదు నని ప్ర
ఖ్యాతజవహయాధిరూఢుఁ డై పురి వెడలెన్. 156

ఆ. ఇట్లు కడకుఁ దొలఁగు టెఱిఁగి యా రాజులు
తిరిగి యరిగి రాత్మ దేశములకు
'రాజు లేనియట్టి రాష్ట్రంబుపైఁ జని
జయము గొనుట యేమి శౌర్య' మనుచు. 157

వ. ఇతండు నయ్యహితభూపతులు తిరిగిపోవు టెఱుంగఁడు గావున నతిదూరంబుగాఁ జని యొక[1]విపినమధ్యంబున నిలిచి యాశత్రువుల నెవ్విధంబున జయింతు ననుచింత నొక్కింత తడవుండి భవితవ్యతానుసారంబున నిట్లని తలపోసె. 158

సీ. మిగులంగ మట్టుపా టగుటఁ జేసి కలంక
[2]నెఱిఁగి యెఱింగింప నెఱుఁగ కిట్లు
శీఘ్రింబ యేఁగుదెంచితి నసహాయత
నేమయ్యెనో పురం బేమి యైరొ
ప్రజ లేమియైరొ విపక్షభూపాలకు
లిది యెఱుంగ నుపాయ మేదియొక్కొ
చొప్పు మార్చితిఁ బెక్కుచోట్ల శాత్రవభీతి
నావారుఁ గనలేరు నన్ను నరసి

తే. యేన తిరిగిపోయెద నంటి నేని శత్రు
లెచట నెట్టడ్డగింతురో యిదియుఁ దగద

1. మహావిపి. 2. నేరికి నెఱి.

యున్నచోటనె యుండి తా నుల్లమునను
సకలమును గాంచువాఁ డెంత సుకృతియొకో. 159

క. అట్టిమహత్త్వముఁ గాంచిన
యట్టిబ్రదుకు బ్రదుకుగాక యన్యమహత్త్వం
బెట్టిదియు నేల జనులకు
వట్టిప్రయాసంబు [1]దానివలనఁ దలంపన్. 160

వ. అని యట్టిసర్వజ్ఞత్వంబు సాధించుటకు దృఢనిశ్చయంబున మహోత్సాహుండై తురగాధిరోహణంబు సేసి వాసుదేవ నిత్యసాన్నిధ్యసిద్ధి ప్రసిద్ధం బైనయమునాతీరంబున కరిగి యందు బృందావనంబున. 161

క. [2]తా నెప్పుడు నతిభక్తిం
బూని కొలుచు బాలకృష్ణుఁ బురుషోత్తము ను
త్తానశయుఁ వటపత్రశ
యానుఁ మది నిలిపి సలిపె నధికతపంబున్. 162

సీ. కొమరొందుమఱ్ఱియాకునఁ బవ్వళించి చూ
పట్టెడు బాలరూపంబుతోడఁ
బాణియుగ్మంబునఁ బదిలంబుగాఁ బట్టి
మొగమున నిడుపదాంబుజముతోడఁ
జరణాంగుళీపానజాతలాలాభిషి
క్తం బైనచిన్నిహారంబుతోడఁ
బూని చూడ్కులకు బ్రహ్మానందశైత్యంబు
గులుకునెయ్యపుముద్దుఁ జెలువుతోడ
తే. నతనిమనమున నవిరతధ్యానమహిమఁ

1. కానివలను. 2. తానవయమునతి.

దిరముగాఁ బాదు[1]కొన్న యాదివ్యరూపు
వెలిఁ బ్రకాశింపఁ జేయుచు విష్ణుదేవుఁ
డధిక కారుణ్యలీలఁ బ్రత్యక్షమయ్యె. 163

క. ఆ తెఱఁగునఁ బ్రత్యక్షుం
డై తను "నిష్టమును వేఁడు" మని హరి పలుకం
బ్రీతివశత నించుకతడ
వీతం డేమియును బలుక నెఱుఁగక యుండెన్. 164

క. పదపడి ప్రబద్ధుఁడై త
త్పదపద్మంబులకు భక్తిఁ బ్రణమిల్లి తగన్
నుదుటన్ ముకుళితకరములు
గదియించి వినీతి దనరఁగా నిట్లనియెన్. 165

క. "అలఘుతరానందంబునఁ
బలుక నెఱుఁగకున్నవాఁడ బరమపురుష! నీ
వలనన్ సర్వజ్ఞత్వము
గలుగుట నాకోర్కి; దానిఁ గరుణింపు దయన్." 166

వ. అని విన్నవించుటయు నద్దేవదేవుండు తనమెడ నున్నరత్న హారంబుఁ దిగిచి "దీనినాయకరత్నం బెవ్వరిహృదయస్థలంబున నెంతతడవు సోఁకి యుండు వారికి నంతతడవును సర్వజ్ఞత్వం బును, సకలవాక్పటుత్వంబును గలిగి యుండు" ననియును, "బ్రాహ్మణమనోవ్యథఁ గావించువారియొద్ద నిది యుండ" దనియు నానతిచ్చి [2]యిది యితనిచేతి కిచ్చి యంతర్ధానంబు నొందెఁ; నితండు నమ్మహనీయహారంబు వడసివచ్చువాఁ డవ్వనంబులో నొక్కదేవాలయంబునందు. 167

1. కొన్నట్టి యరిగి దేవురూపు. 2. యతనిచేతికి నద్దివ్యహారంబునిచ్చి.

సీ. మెఱుఁ గెక్కి బిగువులై మీటిన నవియున
        ట్లింపొందుగుబ్బపాలిండ్లతోడఁ
గడుఁ గృశత్వంబునఁ బిడికిటిలోపల
        నడఁగెడుబడుగు నెన్నడుముతోడఁ
జిఱునవ్వు తెలినిగ్గు చిలుకుచుఁ దనరారు
        తళుకు లేఁ జెక్కుటద్దములతోడ
జగతి నెందును లేనిచక్కఁదనాన సొం
        పగుచిన్నిముద్దునెమ్మొగముతోడఁ
తే. గరము విలసిల్లుసకలాంగకములతోడ
రహిఁ దనర్చునలంకారమహిమతోడ
ద్వారశాఖలదండ నింపారుచున్న
ప్రతిమ నొక్కటి చూచె భూపాలచంద్ర! 168

క. చూచి మనంబున మెచ్చుచు
నాచేరువ నితఁ డటుండ, నంతటిలో భ
వ్యాచారశీలుఁ డచటికి
వాచంయముఁ డొకఁడు మార్గవశమునఁ జేరెన్. 169

తే. చేరి కాషాయవస్త్రంబు చెఱఁగు విసరు
కొనుచు "హరిహరి" యనుచు నింపున నొకింత
తడవు గూర్చుండెఁ దత్సవిధప్రదేశ
మంటపంబున నధ్వశ్రమంబుకతన. 170

సీ. ఆయతీశ్వరుఁ డంత నతిరమ్యమైనయా
        లెప్పంపుఁబూఁబోఁడి యొప్పు చూచి
"బళిర శిల్పికులేంద్ర! బ్రహ్మను మీఱితే
        పగిదిఁ జేసితిర యీప్రతిమ?" ననుచుఁ

దనమునిఁ గడుమెచ్చితల యూఁచుచును "నిట్టి
పడఁతులు గలరొకో పుడమి!" ననుచు
"నిట్టిది సన్న్యాసి కీర్తింపఁ దగ" దని
మార్మోము వెట్టుచు మఱియు మఱియు
తే. నిచ్చఁ గ్రమ్మఱఁ జూచుచు నేమి చెప్ప!
నతనువికృతికి లో నయ్యె" ననుచుఁ జెప్పి
కొంతసంకోచ మంద నాకొమ్మ తెఱఁగుఁ
గని తొలఁగి పోయె నొకనెపంబునను మంత్రి. 171

క. జనపతియు భార్యవదనముఁ
గనుఁగొని "యేమయ్యెఁ గడమకథ? కౌతుకముం
బొనరించుచున్న యది నా
కును; వినిపింపంగ వలయుఁ గోమలి" యనియెన్. 172

చ. అన "నిఁక నేమి చెప్పుదు జనాధిప! యాయతిముఖ్యుఁ డంత నె
మ్మనమునఁ బట్టు లేక ప్రతిమన్ బిగియారఁగ వుంగిలించె నిం
పొనరఁగ లేచి వచ్చి కడ నొక్కమఱుంగున నప్డు సుగ్రహుం
డునికి యెఱుంగమిఁ; నగియె నుండఁగ లే కితఁడుంగికాకికన్.

వ. నగుటయు నతం డది వినియు విననిచందంబుఁ గల్పించుకొని తత్ప్రతిమాలింగనం బొకయదృచ్ఛాచేష్టావిశేషంబుగాఁ గప్పిపుచ్చుటకుఁ దాత్కాలికయుక్తి నద్దేవాలయంబున వెండియుం గల దౌవారికాది ప్రతిమల నట్ల యాలింగనంబు చేయుచు నమస్కరించి తత్ప్రదక్షిణంబు సేయం దొడంగిన. సుగ్రహుండును నతని కపటచేష్టల తెఱం గెఱింగి "యిట్లింత చేసిన నీపూర్వంపుఁ జేత నే నెఱుంగుదును గదా! యది మఱవ" ననుచు మఱియుఁ బరిహాసించె; దాన నయ్యతి యతి

వ్యథమానమానసుం డగుచుఁ గడు నలిగి "యిది తుదగా నీమొదలియెలుక యెంతగల దంతయు విహతం బగ్యోడు" మని శాపం బిచ్చె. సుగ్రహుం డతిభయాకులుం డగుచు శాపమోక్షంబు దయచేయు మని పాదంబులం బడి లేవకుండె నతీశ్వరుండును. 174

క. "నాయీరహస్యచేష్టిత
మేయెడ నేనియును నుబ్బనేని కలుగు నీ
పోయినమది గ్రమ్మఱఁ ద
దాయత్తత వెలయు నప్రియము మఱి లేమిన్." 175

ఆ. అనుచుఁ జనియెఁ నతనియాశాపమహిమచే
నెఱయ సుగ్రహుండు మఱచిపోయె
నాక్షణంబుతుదగ నటు ప్రథమమున వి
జ్ఞాత మగుప్రపంచజాత మెల్ల. 176

తే. అట్లు విస్మృతసకలపూర్వాత్మచరితుఁ
డగుట నీతఁ డెఱుంగ లేఁ డయ్యెఁ దిరుగఁ
గైకొనంగఁ దదాదిమక్షణమునం దె
యొకశుచిస్థలి నిడినహారోత్తమమును. 177

తే. "బ్రాహ్మణవ్యథ గావించుపాపమతికి
నిది నిలువ" దంచు హరిపల్కు మొదల వినియు
నతని వెతఁ బెట్టి కోల్పోయె హార మితఁడు;
"దైవఘటన యెవ్వారికిఁ దప్పు టరుదు." 178

క. ధర నెవ్వారలు సేసిన
దురితంబులు నుచ్చరింప దోసముఁట మహా

పురుషుల కొకకొద యొకచోఁ
బొరసిన నది పగటుపాపము వృథా చనునే? 179

ఉ. అంతట దైవసంఘటన నచ్చటు వాసి యతండు దివ్యదే
శాంతరముల్ చరించుచు నిజాహ్వాయవంశచరిత్రవిస్మృతిన్
భ్రాంతునిలీల మత్తుగతి బాలునికైవడి నెద్ది గన్న న [న్.
త్యంతము నద్భుతం బగుచు నాత్మకుఁ దోఁచుచు నుండ వర్తిలె

క. ఆదిమ సంకేతగ్రహ
ణాదులు విస్మృతము లగుడు నాఖ్యాగుణజా
త్యాదివ్యవహారజ్ఞత
లేదయ్యెను నితని కపుడు లేశం బైనన్. 181

చ. వెనుకఁ గ్రమక్రమంబున నవీనముగా నుదయంబు నొంది పెం
పొనరె నృపాల! యీతనికి నుత్తమమధ్యమవృద్ధకర్మద
ర్శనమున ద్రవ్యకర్మగుణజాతివిశేషవివేచనంబు బా
లునకునుబోలె మానసములో నిఖిలవ్యవహారహేతువై.

క. తనకులనామాదులు ద
క్కన శేషము నిట్లు వెలసెఁ గాని యితఁడు భూ
జనవర యని యెఱుఁగడ యెం
దును దద్జ్ఞులు నేటిదాఁక దొరకకయునికిన్. 183

వ. ఇవ్విధంబున బరిభ్రమించుచు నొక్కనాఁడు గంగాసరయూ
సంగమప్రాంతవనంబు చేరి వర్తిలుచుండఁ దత్కాలంబునందుఁ
గాసారపురం బరాజకంబైన నందుఁ గలమంత్రిప్రముఖరాజ
పురుషులును బౌరులును రాజనిశ్చయార్థులై యుత్తమ
గజంబు నలంకరించి దానికరంబున నొక్కపుష్పమాలిక యిచ్చి

"యిది యెవ్వనికంఠంబునం దగులవైచు నతండు మనకు రా"జని దైవ ప్రార్థనాపూర్వకంబుగా నియమంబు చేసికొని దాని వెంబడి నేతేర నది యేతెంచి తనతొండంబుననున్న పుష్పమాలిక యీసుగ్రీవునిమెడ వైవ నరాజకత్వదుఃఖ దుర్బలులై యున్న యామంత్రిముఖ్యుల కందఱకు నటమున్న యితనిదర్శనమాత్రంబున నొక్కసత్త్వవిశేషం బుదయించె, నయ్యుభయనిమిత్తంబుల నత్యంతసంతుష్టు లగుచు నతనిఁ దద్గజారూఢునింగాఁ జేసి పురంబునకుం గొనిపోయి రాజ్యాధి పత్యంబునకుం బట్టంబు గట్టి తత్స్వరూపమాత్రంబ తమకు మున్ను సత్వాదాయకం బగుట సంస్మరించి సత్వాదాత్ము డని ప్రశంసించిరి; యితనినామధేయం బప్పటి కప్రసిద్ధంబు లగుట నదియ పేరగుచు దిక్కులం బ్రఖ్యాతంబయ్యె; నట్లు కాసారపురాధీశ్వరుం డై రాజ్యభోగంబు లనుభవించుచు నంతట భవజ్జననీజనకు లయినసుముఖాసత్తిమణీస్తంభులఁ దన పురంబున నిలుపుకొని సేవ సేయుచుఁ గ్రమంబున నీకు నమాత్యుం డయ్యెఁ; దత్ప్రకారంబులు విస్తరంబుగా శైశవంబు నందయేను నీకు విన్నవించినదానఁ, దలంచికొనుః మువ్విధం బున నమాత్యుం డైనవెనుక నంగదేశంబాక్రమించి యందుఁ గ్రముకకతోత్తరనామధేయం బైన యీపురంబు నూత నంబుగ నిర్మించి నిన్నుఁ బట్టంబు గట్టినది నీకు విదితం బై నది చెప్పనేల? యోవిశ్వవిశ్వంభరామండలేశ్వర! యీసత్వా దాత్మునికులనామాదిప్రకారంబులు పూర్వంబున నతఁ డడుగ నపు డేను జెప్పకుండుటకు నిప్పుడు చెప్పుటకు మఱియు

నాఁటి సకలజ్ఞానోదయంబునకు నిమిత్తం బడిగితి; రది
విన్నవించెద; వినవధరింపుఁ" డని యిట్లనియె. 184

సీ. అట్లు సుగ్రీవుఁడు మున్నా దేవతాలయం
బునఁ బెట్టి క్రమ్మఱఁ బుచ్చుకొనఁగ
మఱచినయట్టి యమ్మణివారమును మధు
రాపురాశ్రయుఁ డొకబ్రాహ్మణుండు
దైవవశంబునఁ దా నచ్చటికి వచ్చి
కని పుచ్చుకొని పోయి తనగృహమున
బహువర్షముల్ వేల్పుబలె భక్తిఁ బూజించి
యంతట నిది త్రిలోకాధిపతికి
తే. యదుకులాభరణంబున కచ్యుతున కు
పాయనంబుగఁ గొనిపోవు టర్హ" మనుచు
ద్వారవతి కేగి యతని సందర్శనంబు
వడసి కానుకగాఁ బెట్టె బార్థివేంద్ర! 105

చ. అనయముఁ బ్రీతితో హరియు నాతని కానుక యాదరించి కై
కొని తదభీష్టవస్తువులు గొబ్బునఁ దాఁ గృపచేసి యప్పుడిం
పొనరుచు దండకాకృతిసముజ్జ్వలసంస్తవలీల కెంతయుల్
ఘనముగ మెచ్చి యిచ్చె మణికంధరనామునకుల్ ధరాధిపా.

చ. అతఁడు మహాప్రసాద మని యప్పుడు దానిఁ దగల్ ధరించి
బాలతఁ గనుపట్టువిష్ణునికలాపము గావునఁ దద్భుజాంతర
స్థితి కిది చాల కొప్పి గళసీమన యొంతయు గుప్తమై; తదీ
యతరళ మీఁదు చిద్గుణము నాతనికిల్ హృదయంబు
సోఁకమిన్. 187

ఉ. ఆమణికంధరుండు తుదియం దలఘువ్రతుఁ జేర్చె దాని; నా
భూమిసురుండు నీ కొసఁగె; భూరికృపోన్నతి నిచ్చి తీవు నా
కో మహితాత్మ! తత్తరళ మొప్పఁగ నాహృదయంబు సోఁక సు
ద్దామసుబోధ నైతి శిశుతాసమయంబున నట్లు మిక్కిలిన్. 188

ఉ. క్ష్మావరచంద్ర! నీవు ప్రథమంపుజనిన్ మణికంధరుండ వై
యావిధిఁ గృష్ణుచేఁ బడసి యంతట నిజ్జననంబునందు భూ
దేవవరేణ్యుచేఁ బడసి దివ్యము నమ్మణిహారముం గృపై
కావృతబుద్ధి న ట్లొసఁగి యంతగఁ జేసితి నన్ను మున్ననన్.

క. ఇటు నటు నేఁ గదలఁగ నం
తట హృదయస్థలముఁ బాసి తన్మణి కడ కే
గుట నుడిగెఁ దెలివి య ట్లా
దట నీమంత్రీశుఁ డడుగుతఱి నవనీశా! 190

వ. కావున నప్పుడు సత్యదాత్మునినామజాత్యాదు లేను జెప్ప
కుండుట కిది కారణంబు; నాఁ డట్లు బోధోదయం బగుటయు
నుడుగుటయు నేతన్మూలంబు లని యెవ్వరు నెఱుంగకుండుట
నిది సామాన్యహారంబ యనుతలంపున మావారు దాఁచి
మఱచుటఁ జేసి నాఁటనుండి నేఁటిదాఁక నిద్దివ్యహారం బెన్నఁ
డును ధరియించుటయు లేదు; నేఁ డాభరణ భరణసమయం
బున బ్రసంగవశంబునఁ దలంచుకొని చెలులు తత్ప్రాప్తి
ప్రకారం బెఱింగింప నిది సుముహూర్తలబ్ధం బైన ప్రథమ
భూషణం బనియు భవద్దత్తం బనియు నత్యాదరంబునఁ
దెప్పించి హృదయభాగస్పర్శినాయకరత్నంబుగా నిపుడు
ధరియించియున్నదాన నిచ్చోటికి నిపుడు నూపురంబులు
గొనుచు సత్యదాత్ముం డేగుదెంచిన "నింతలోపలికొలువునకు

వచ్చుపాటిచనువుకలిమికి నితం డెంతభాగ్యవంతుఁడో కో!"
యని యొక్కింతుక భావింప నితనిజాత్యాదు లిన్నియు
మదీయహారనాయకమాణిక్యంబు మాహాత్మ్యంబున నిట్లు
చెప్పఁ దొడఁగె; భూతభవిష్యద్వర్తమానభువనప్రపంచంబు
నందు నెద్దియైన దేవరకుఁ దెలియవలసినయది కరతలామలక
సమానం బై కనంబడియెడు; దీని ధరియించి చూడుఁ"డని
యనుపమస్తనకుంభలక్ష్మి తెఱచాటున న ర్తకి తెఱంగునఁ గ్రించి
త్ప్రకాశాప్రకాశరూపం బగుచు నపూర్వంబు నెఱపు నమ్మహా
నీయరత్నమాలికఁ దనదుపయ్యెద వెలుపలికిం దిగిచినం జూచి
యా జగతీవల్లభుండు. 191

ఉత్సాహ. "శివకు మట్టియుండనిమ్ము; తిరుగఁ బుచ్చుకొనుటయె
ప్పువునె నీకు నిచ్చినట్టిహార మట్ల యుండఁగా
నువిద దీనిమహిమఁ దెలుపుఁ టొప్పుఁ గాక యన? బళీ
యవనినాథ! జాణ; విది యుపాయ!" మనుచు నవ్వుచున్.

తే. ఒఱగుమీఁదటఁ జేరి కూర్చున్న ప్రియుని
యురము తరళంబు సోఁక మే నొయ్య వంచి
"కనఁగ వలసినయది కనుం" డనుచు నంతఁ
గుచభరాలసవోలె నక్కునను వ్రాలె. 193

క. "వనజాక్షి! యిపుడు గనవల
సినయది నాకిదియె" యంచుఁ జెలువుఁడు తమకం
బునఁ గౌఁగిలించె నిరు గే
లను బిగియారంగ మధురలాలసఁ బ్రేమన్. 194

చ. మదితమి నంతటఁ నిలక మానవనాథుఁడు చిత్తభూవశం
వదబహుచేష్టితుం డగుచు వర్తిల "నేమిటికిం గడంగి యె

య్యది దొరకొంటి! మేలనుచుఁ దబ్జజుఁ డిద్దఱిఁ జంచలాత్ములై
సదృశులఁ లెస్స కూర్చె జతనంబున" నంచుల తాంగినవ్వఁగన్.
ఉ. అంతట నెట్టకేలకుఁ బ్రియాంగనప్రార్థన నవ్వసుంధరా
కాంతుఁడు తేటతెల్లమిగఁ గాంచెఁ దదుక్తకథాప్రపంచ మ
త్యంతము సత్యమౌట మహితం బగుతత్కుచమధ్యరత్నసం
క్రాంతిని హృత్ప్రదేశ మెసఁగఁగ మది నించుక పాఱఁ జూచు
చున్. 196
వ. అంతట సత్త్వదాత్ముండు శాపమోక్షంబున నాబాల్యానుభూత పదార్థజాలంబంతయుఁ దనంతన యాత్మసంస్మరణగోచరం బగుచు నటమున్న మధురలాలసచేతఁ దా వినిన[1]వి కలిగి సరి దాఁకుచుఁ బ్రమోదంబు నద్భుతంబు నాపాదించుచుండ నేగుదెంచి తగినయవసరంబు దెలిసి యాకళాపూర్ణమహా రాజుం గాంచి తనకుఁ బునఃప్రాప్తం బైనయాయెఱుక తెఱంగు విన్నవించి మాయమ్మ మధురలాలస దేవరకు భిక్షుక కాముకత్వంబు కడముట్ట విన్నవించెనేమో? యిట్లు శాపవిము క్తుండ నైతినని యనేకప్రకారంబుల నాపుణ్యదంపతుల సంస్తుతించి "తొల్లింటినాఁటి మహారాష్ట్రరాజ్యభోగంబు కంటె ననేకగుణంబుల నధికంబై యిప్పటిదేవరపాదపద్మ సేవ పరిపూర్ణసౌఖ్యంబు నొసంగుచున్నది; యదయెల్ల కాలంబు నాకుఁ గలుగ ననుగ్రహింపవలయు"నని సాష్టాంగప్రణామం బాచరించె; నతండు మధురలాలసాబంధుత్వవిశేషజ్ఞానంబున నతని నెప్పటికంటె మిక్కిలి గారవించి గృహంబున కనిపి, మఱియు నభిమతవస్తుబోధసాధనేచ్ఛల మధురలాలసాపరిరం భణసుఖంబు లనుభవించుచుండె; నప్పుడు. 197

1. వినుకలికి.

ఆ. ఉభయహృదయదేశ యుగపన్మణిస్పర్శ
మహిమ నొక్కరొకరి మక్కువపస
లొక్కమాటె యొక్క రొకరి కేర్పడఁ దదా
శ్లేషసుఖము మిగులఁ జిత్ర మయ్యె. 198

క. శుభధర్మ శీల యగువ
ల్లభయత్నముచేత నపు డిలాపతి దనపై
నభినవకౌముదికిం గల
సుభక్తి గని తదుచితంబు చొప్పడ నడపెన్. 199

చ. అలఘుతరానుభావ యగు హైహయకన్యక హారశక్తిచేఁ
దెలివియు వాక్పటుత్వమును దేజరిల౯ నిజపూర్వవాసనా
బలమున వల్లకీరణనపాటవ మెంతయు మీఱ దిద్దె భూ
తలవిభుఁ [1]డగ్రతం దనరి తద్దయు గానకళాప్రవీణగన్. 200

చ. సకలమహీజనావనవిచారము సంధిల నంత నోలిమై
నకలుషధర్మశోభిని మదాశయపుత్త్రిక యత్న మొప్ప భ
ర్తకుఁ దెలిపె౯ స్వరాష్ట్రపరరాష్ట్రగుణాగుణవర్తనల్ సనా
యకపరిరంభకాలముల నప్పటి కప్పటి కెచ్చరించుచున్. 201

సీ. "తా విన్న కన్నయర్థముఁ జెప్ప కడఁచెవిఁ"
డని తెల్పి శిక్షించుఁ దనదుచెలుల
"రిపులకు లోనిచ్చె; నపరాధి యయ్యె వీఁ"
డని యమాత్యులతప్పు లరసి యడఁచు
"ముచ్చిలఁ దలఁచె వీఁ డిచ్చలో" నని మూద
లించి దండించు మలిమ్లుచులను

1. డప్పా డగ్రసతిఁ దద్దయు.

"నాలితో రే యీతం డతిమాత్రమున నగ్గిం
దగ" దని చెప్పించుం దగినరీతి

తే. మధుర[1]లాలస సపరిరంభణవిశేష
సమయహృద్దేశఘటితతచ్చారుహార
తరళమాహాత్మ్యమున సముత్తీర్ణుం డగుచు
భువన మరుదంద నాకళాపూర్ణుం డపుడు. 202

వ. అంత నొక్కనాం డతండు మధురలాలసతోడ నేకాంతంబున నుండి సర్వజ్ఞత్వకారణదివ్యమాణిక్యప్రశంసాప్రసంగంబున విష్ణుదేవునిమాహాత్మ్యంబు తలంపునం బొడమం దదీయకీర్తనం బిహపరసాధనం బని సంభావించుచుం దత్ప్రసంగవశంబున. 203

తే. ఆదిజన్మంబునందు ననంతశయన
పద్మనాభునిసన్నిధి భాగవతుల
వచనమున రమావిష్ణుసంవాదనకథ
తా నొనర్చుట మదిలోనం దలంచుకొనియె. 204

క. ఈపగిదిం దలంచుకొన సుక
లాపంబుగ దాని మధురలాలస మధురా
లాపములచేత వినుటకు
భూపాలునిమదిని వేడ్క పొడమెం మిగులన్. 205

ఆ. ఇట్లు వేడ్క పొడమ నిందు బింబానన
యాననంబుం జూచి యానృపాలుం
డాదరాతిశయము ననురాగమును గరం
బలరుచుండ నిట్టు లనుచుం బలికె. 206

1. లాలసాపరిరంభ విధివిశేష.

ఉ. "ఆదిమ మైనజన్మమున నంగన! యేను రమాముకుందసం
వాదము కావ్యరూపమున వర్తిలఁ జేసితి నంచు వింటి బా
లోద్యదితతావకీనమధురోక్తులలో; నది నీమణీగుణ
శ్రీ దనరార నారసి యశేషము నిప్పుడు చెప్పఁగాఁ దగున్.

క. నీపరిరంభణమహిమను
దీపిత మగు తెలివివేళఁ దిరముగ నది యే
నోపడఁతి! కనుట లే దెదఁ
బైపై నీమీఁదితమి విభాసిలు చునికిన్." 208

వ. అని పలుకుప్రాణవల్లభునిపలుకులకు నగుచు నమ్మగువ యో జగతీవర! దేవరమది కిప్పు డెయ్యది ప్రియం బదియ చేయుట నాకునుం బరమప్రేమాస్పదంబు గావున నప్పావనకథ యెల్ల వినుపించెద; విన నవధరింపు మని పలికి, తనకు సకలజ్ఞాన నిదానం బగుచుహృదయప్రదేశంబు నలంకరించుచున్న దివ్యహారనాయకమాణిక్యంబునకు నంజలిచేసి, తదీయప్రాప్తి కారణంబులైన యాకళాపూర్ణు నలఘువ్రతు మణికంధరుఁ గృష్ణుని విప్రుని సుగ్రహు వటపత్రశాయిని హృదయంబునఁ దలంచి, యీగురుపరంపర నాకు ననుగ్రహకారిణి యగుఁ గావుత మనుచుం బ్రణమిల్లి, యాలక్ష్మీనారాయణ సంవాదకథ తొల్లిటిమణికంధరోక్తప్రకారంబున నిట్లని చెప్పం దొడంగె. 209

సీ. అమృతపూరాశ్చర్యతమవిరజానదీ
సీమావరుద్ధసంసృతికథంబు
పరిగణనాతిగబ్రహ్మాండబుద్బుద
ప్రకృతిపాథోధిపారాయితంబు

సూర్యచంద్రాగ్ని తేజోనిరపేక్షణా
ప్రాకృతస్వప్రభాభాస్వరంబు
స్వేచ్ఛాగృహీతసమిద్ధవిశుద్ధస
త్త్వ శరీరనిత్యముక్తవ్రజంబు
తే. నగుచుఁ బెంపొందునిఖిలవేదాంతసిద్ధ
పరమకల్యాణగుణచణబ్రహ్మతత్త్వ
సతతసాక్షాత్క్రియావిభూషితనిజాను
భవసుఖితకోవిదము శౌరిపరమపదము. 210

తే. చిదచిదీశ్వరాత్మకము నశేషజగదు
పాశ్రయము తోయమూతవహాపవనవియద
హంక్రియామహదవ్యక్తకావరణము
నగునజాండాలి కవల నజ్జగము మెఱయు. 211

క. గణుతింపఁ బ్రకృతిదోషము
లణుమాత్రము లేవు; గాని యచటఁ బరగు స
త్పృణుతబ్రహ్మాదిజగ
ద్గుణమహిమ లనంతకోటిగుణిత సమృద్ధిన్. 212

క. అరము నరణ్యము ననఁగా
శరధు లమృతమయము లచట [1]శతకోర్మిసము
త్కరశీకరశీతలతర
మరుదురుపులకిత తటద్రుమము లై యమరున్. 213

క. ఆవిష్ణులోకమున [2]కవ
మావాహిని విరజ యమరు మానితమోక్ష

1. ( జటులోర్మి; సతతోర్మి. 2. సీ,మా,

శ్రీవరణరాగభాగవ
తావళి శుభలగ్నసమయ యవనికపోలెన్. 214

శా. ఆసింధూత్తముచేరువన్ సరసియొం డైరమ్మదీయంబు నా
భాసిల్లున్ జలనీలికాకబరికాపద్మాస్య పుష్పంధయా
లీసంవీక్షణవీచికావళి మృణాలీబాహుకోకస్తన
శ్రీసంపాదితమూర్తిముక్తిపదలక్ష్మీమండలీ [1]కర్తయై. 215

తే. ఆసరోజాకరముపొంత నతిశయిల్లు
బిల్వభూరుహ మొకటి శోభితపలాశ
విసరకిసలయసముదయోల్లసనమహిమ
నవిరళస్థితశుకపుంజ మనఁగఁదనరి. 216

ఆ. ఇంపు మీఱు నచట నెంతయు నశ్వత్థ
శాఖి యొకటి సామసదన మనఁగ
మహిమతో సువర్ణమయము శాఖాత్రయీ
శోభితంబు నగుచు శ్రుతులు పొగడ. 217

చ. నెలకొని యమ్మహీరుహమునీడను బంచశతాప్సరస్సుమ
ధ్యలు సువర్ణకజ్జలఘటాభరణంబు లనేకముల్ కరం
బుల ధరియించి వర్తిలుచు ముక్తత నచ్చటి కేగుదెంచువా
రల కెదు రేగి చేయుదురు ప్రౌఢిమ సంధిలఁగా నలంక్రియల్.

సీ. కలికికన్గొనలచూపుల పేరఁ బర్వు మ
వ్వపునల్లఁగల్వలు వైచి వైచి
మందహాసము లను చందనోదకములు
పలుమాఱు మోములఁ జిలికి చిలికి
హారంబు లిడుచు బాహారుచిచ్ఛలమున

---

1. తరళ్యక్షమై.

భుజములందు హారిద్రఁ బూసి పూసి
శ్రుతిభూషణము లమర్చుచు హస్తకాంతికుం
కుమములు చెక్కిళ్లఁ జమరిచమరి
ఆ. యలరఁ జేయు నచ్చరలపిండు ముక్తిక
న్యలను బెండ్లియాడి బులియుచున్న
క్రొత్తపెండ్లికొడుకుఁ గొమరుల సయ్యాట
లాడుతద్వధూవయస్య లనఁగ. 219

వ. ఇవ్విధంబునఁ బరమామ్నాతం బైనయాభువనోత్తమంబునందు.

తే. ఉభయకర్మతంత్రులకు నయోధనీయ
మగుట నామ్నాయము లయోధ్య యని నుతింప
వాఙ్మనసగోచరము గాని వైభవమునఁ
బ్రబలు రాజీవలోచనురాజధాని. 221

సీ. ఘటమంచుఁ బటమంచుఁ గారుయుక్తులఁ బెంచు
దుష్టతార్కికులకు దూరమగుచు
శ్రుతియంచు స్మృతులంచు శుష్కకర్మములెంచు
మీమాంసకుల కప్రమేయమగుచు
ఝురియంచు ఖరియంచు జనులవీనుల నొంచు
శబ్దైకరతుల కసాధ్యమగుచు
మృషయంచు మిషయంచు విషయోక్తిఁ గలహించు
నద్వైతపరుల కప్రాప్యమగుచుఁ
తే. గృష్ణ! విష్ణో! హృషీకేశ! కేశవ! యను
భక్తుల కొకప్పుడును దుర్లభంబు గాక
పరగుఁ బ్రకృతవికారదుస్పర్శతరము
గురుతరానందఝరము వైకుంఠపురము. 222

చ. తడఁబడుచుండు నందు నమృతంపుఁగొలంకులు రోప్యభూము
లన్, వెడలుపచ్చరాచలువనేలలు పచ్చికచోట్లుఁ గెంజికెం
జడిగొనుపద్మరాగమణిసౌధములుం దలిరాకుమ్రాఁకులుం
బడఁతులపిండు భిత్తిగతభాసురతత్ప్రతిబింబజాలముల్. 223

క. పరమసుమనోమనోజ్ఞతఁ
గర మాత్మారామపరవికాసము దనరం
గరువపుఁజరితలగరితల
గరగరికలగరిమ నంగగరిమకు నమరున్. 224

చ. "విరులు రచింప నేల తమ వింతగునవ్వులసొంపు గల్గఁ గ
స్తురికలయంపు లేల తమచొక్కపుఁజూపులయింపు గల్గఁ? గ
ప్పురముల ముగ్గు లేల తమపుణ్యనఖద్యుతి పెంపు గల్గ?" నం
చరుదుగఁ జూపఱుల్ పొగడ నయ్యుయిలీలఁ జరింతురంగనల్.

సీ. విరులపొందిమి పేరఁ బరిశుద్ధసత్త్వంబుఁ
దలిరాకునెపమున నలఘుకృపయు
దళమిషంబున నాత్మఁ గలకృష్ణకాంతియుఁ
బుప్పొళ్లు నాఁ గల్మిపొలఁతిడాలు
మధుకైతవమున నమ్మదబాష్పధారలుఁ
గలికాఫలంబునఁ బులకములును
సౌరభసంజ్ఞ సుజ్ఞానవాసనయుఁ జే
రెలమిఁ బేరిట సౌఖ్యవిలసనంబు

తే. వెలిఁ బ్రకాశింప నిత్యముక్తులు నిజేచ్ఛఁ
గొమరు మీఱంగఁ దరులతాకుంజరూప
ధారు లగుచు వర్తింతురు తత్పురంపు
బహువిధోద్యానవాటికాభ్యంతరముల. 226

చ. అలిశుకకోకిలాదివపురాశ్రయలీలఁ దమున్ భజించుని [ము
త్త్యల సుమనఃఫలాదిపరితుష్టులఁ జేయుచు వారిఁ దాము
క్తులకు వినోదలీల సమకూర్తురు వృక్షలతాదులైనవా
రలు "హరిదాసు లెప్పుడుఁ బరస్పరభక్తిపరాయణుల్ గదా!"

సీ. కొన్ని సౌభాగ్యసంపన్నలక్ష్మీపదాం
భోజలాక్షాలక్ష్మీపూజితములుఁ
గొన్ని భూదేవీవిఘూర్ణత్కటాక్ష వీ
క్షాపక్ష్మలితగుళుచ్ఛవ్రజములుఁ
గొన్ని నీళానఖాంకూరవిన్యాసచం
ద్రకితప్రవాళసంతానకములుఁ
గొన్ని భాగవతలోకోన్నతక్రీడావి
భూషితచ్ఛాయా విశేషితములు

తే. నగుచుఁ బరవాసుదేవవిహారకుతుక
విభవముల కాస్పదంబులై వెలయుచుండుఁ
దత్పురోద్యానములు నిరంతరపరాగ
పుష్పరసవృష్టి శీతలభూతలములు. 228

వ. అట్టి దివ్యవస్తువైభవంబులఁ గరంబు గనుపట్టునట్టి యాపట్టణ
మధ్యప్రదేశంబునందు. 229

సీ. రవిచంద్రకోటితిరస్కారధౌరేయ
మహనీయదీప్తిసంపదలఁ బొదలి
వేదప్రసిద్ధమై వెలయునద్భుతరత్న
మయసహస్రస్తంభ మంటపమున
మహితవిభూతియుగ్మవిచిత్రరూపమై
ధర్మాదిసూరిపాదములతోడఁ

జెలువొందు మాణిక్యసింహాసనమున స
హస్ర [1]దళాబ్జమధ్యంబునందు
తే. శేషతల్పాధిరూఢుఁ డై సిరియు ధరయు
నీళయును భజియింపంగ లీల నుండుఁ
గేవలభూరివిలాసాను భావభావి
తాఖిలాజాండవర్తనుం డచ్యుతుండు. 230
తే. ఆసహస్ర[2]పత్త్రంబు పూర్వాది గాఁగ
సకలదళముల విమలాదిసతులు నిలిచి
హరి భజింతురు చామరహస్త లగుచుఁ
గమలనిలయ లీలావతారములరీతి. 231
చ. అతులితభక్తిఁ బూర్వదిశయందు ననుగ్రహ యవ్విధూటి
దాఁ, గుతుకము మీఱఁగాఁ బసిఁడికుంచియవైచుచుఁ గొల్వు
సేయు సంతతమును హస్తకంకణఝణత్కరణ క్వణనంబు
లవ్విభుఁ, జతన "పరాకు స్వామి!" యనుశబ్దములాగున
నెచ్చరించఁగన్. 232
సీ. శయనాసనాంశుకచ్ఛత్త్రాదికంబులు
దాన యై ఫణికులోత్తముఁడు గొలువ
ధ్వజము వాహనము వీవనయునాదిగఁ బెక్కు
రూపులై గరుడుఁ డారూఢిఁ గొలువ
వఱలువిద్యాధిదేవత యైన వేత్త్రంబుఁ
బూని సూత్త్రవతీవిభుండు గొలువ
నారతుకత్వ మింపారఁ దత్పురిఁ గాచు
కుముదాదినిత్యసంఘములు గొలువ

1. దళాఖ్యపద్మాంతరమున. 2. పత్త్రమునఁ బూర్వాది.

తే. భువనముల దుష్టనిగ్రహంబునకుఁ దాన
పాలు పడియున్న యాయుధపంచకంబు
జయజయధ్వను లెసఁగంగఁ జారపురుష
భావమునఁ గొల్వ నావిశ్వభర్త మెఱయు. 233

మధురగతిరగడ.—

కెందమ్ముల నడఁకించుపదంబులు
నిందువైభవము నేలునఖంబులుఁ
గర మరు దగుచొక్కపుఁజిఱుఁదొడలును
గరికరవిభవముఁ గాదను తొడలును
బదియార్వన్నియ బంగరువలువును
మెదలెడితళుకుల మేఖలచెలువును
భువనజనకుఁ గనుపొక్కిలివిరియును
దవిలి యురంబునఁ దనరెడుసిరియును
నఁయ జీవమయ మగుకౌస్తుభమును
నెరయు వైజయంతీ సౌరభమును
ప్రకృతిమయతఁ జొప్పడు శ్రీవత్సము
వికసిల్లఁగఁ బర్వెడు ఘనవత్సము
నహంక్రియాత్మక మగుశంఖంబును
మహనీయమనోమయచక్రంబును
దనర నొకవిచిత్రపుసోయగమును
ననువు పఱచుహస్తాంబుజ యుగమును
నురుగతల్పమున నూఁదినకరమును
బరఁగిన జానువుపై నొకకరమును
నవ్యమకరకుండలసువిలాసము

భవ్యకపోల ప్రకటితహాసముఁ
బవడమును గణింపని నెమ్మోవియు
నవచంపకనిభ నాసికతీవియుఁ
దెలిదమ్ముల నగుతీరునయనములు
పోలు పలరెడు కనుబొమలచెలువములుఁ
గనుఁగొన నింపగుకస్తురినామము
ననుపమాన మగునలకస్తోమముఁ
గలకల నగుచక్కనివదనంబును
ధళధళ మనురత్నకిరీటంబును
ననుకృతజలధర మగువర్ణంబును
దినకోటుల నగియెడుతేజంబును
గలుగుదివ్యమంగళవిగ్రహమును
నలరుభక్తిని త్యానుగ్రహమునఁ
బరఁగురమావిభుఁ బరమపదేశ్వరు
నిరవద్యాత్మకు నిత్యు నిరీశ్వరు
నజు నచ్యుతు హరి నఘసంహారుని
ద్రిజగన్నాథుని ద్రిగుణవిదూరుని
నఖిలశేషిఁ గరుణైకపరాయణు
నిఖిలవేదవర్ణితు నారాయణుఁ
గొలిచి నిత్యముక్తులు ప్రమదంబున
నలరుదు రక్కడ నతివిభవంబున. 234

వ. అందు. 235

సీ. తనవిలోచనసంజ్ఞ దవ్వునకు భువనస
ర్గముఖక్రియాచాతుర్యకంబు నడపఁ

దనవిలాసంబు కాంతునకు శృంగారసా
మ్రాజ్యనీతిధురీణమంత్రి గాఁగఁ
దననర్మలీల నాథునకు దశాకృతి
[1] ప్రకృతికాసూత్రధారత వహింపఁ
దనముద్దుఁ బల్కు భక్తవితానవాత్సల్య
కర్ణికారవికాసకారణముగ
తే. నఖిలకళలందుఁ దోడునీడగుచు మెలఁగు
నధిపునకుఁ బౌలమున్నిటియాఁడుబిడ్డ
యరిది మక్కువ [2] టెక్కువ నవిరతంబు
నురము దింపక యతఁడు దన్నుపచరింప. 236

ఉ. ఆజగదేకమాత తగునట్టిప్రసంగవశంబునన్ సము
ద్వ్యజకభూరిసంసృతినవీనదవానలతప్యమాన నా
నాజనకోటిఁ బ్రోచుకరుణారస మాత్మఁ గడుం దొలంక నీ
రేజదళాక్షుఁ జూచి మృదురీతి[3]ఁ దలిర్పఁగ నప్పు డిట్లనున్.

క. దేవా యిపు డొకయర్థము
దేవర నడుగంగ బుద్ధి దివిరెడు మిగులన్
నావిన్నపము ప్రసాద
శ్రీ వెలయఁగ నొకటి యవధరింపఁగ వలయున్. 238

ఉ. ఈభువనంబు లెల్ల సృజియింప భరింప హరింపఁ గర్తవై
శోభిలువాఁడ వీవ మధుసూదన! యంబుజసంభవుండుఁ జే
తోభవవైరియున్ గ్రమముతో భవదీయకృపాసమర్పిత
ప్రాభవులై కదా కనిరి పన్పడ సర్గలయాధికారముల్. 239

1. ప్రకరణసూత్ర. 2. పెక్కువ. 3. వినీతిదలిర్పనిట్లనున్.

తే. జీవకోటుల నుభయకర్మావలీఫ
లానుభవమున దరి చేర్ప నాత్మఁ దలఁచి
నీవు బ్రహ్మాండసృష్టిరక్షావిలయము
లిట్లు గావింతు వని నుతియించు శ్రుతులు. 240

ఆ. ఆదియుఁగాక మొదలు తుద లేనిసుకృతిదు
ష్క్రియలు భోగమునఁ దరింపరామి
నరసి యాత్మబోధనార్థమై వేదశా
స్త్రములు గలుగఁ జేసి తమలకృపను. 241

ఉ. అట్టిశ్రుతిస్మృతుల్ దెలుపునట్టియుపాయము నాదరింప కి
ట్టట్టు చరించి ముక్తి కెడయైనజనంబులఁ బ్రోచుసత్కృపన్
నెట్టన రామకృష్ణముఖనిర్మలమూర్తులు దాల్చి తీవు ని
న్నెట్టు నుతింపనేర్తుఁ [1]బరమేశ! యకారణసత్కృపాపరున్.

ఉ. ఇంచుకయేని వేసరక యీగతిఁ జెక్కిలిగొట్టి పాలు ద్రా
గించువిధంబునన్ బలిమిఁ గేశవ! నీవు హితంబొనర్చుచో
నెంచఁ గృతార్థుఁ డొక్కఁ డొకఁ డింతియె కాని సమస్తజీవు
లుం,గొంచకయంతకంతకును గ్రుంకెదరుగ్రభవార్ణవంబులోన్.

క. ఇది యంతయు నీమాయా
భ్యుదయవిలాసంబు దెలియఁ బురుషోత్తమ! నీ
మదిలో నెయ్యది దలఁచిన
నొదవక మాన దని తోఁచుచున్నది నాకున్. 244

ఉ. కావున నెల్లజీవులకుఁ గారుణికోత్తమ! నీయనుగ్రహ
శ్రీవిభవంబుచే నమృతసిద్ధిగఁ గోరెద సర్వశేషి వొ

1. బరమేశు నకా.

దేవరకుఁ విభేదము మదిం గలదే యొకకొందఱఁ భవా
భావముఁబొందఁజేయుభవబంధులఁ గొందఱఁజేయనచ్యుతా!

వ. అని యివ్విధంబున సకలరక్షణార్థంబుగాఁ బరమకరుణావేశ
కలితహృదయ యగుచుఁ బలుకు తననెయ్యంపుఁదొయ్యలి
తియ్యంపు బలుకుల కయ్యంబుజాక్షుం డిచ్చ మెచ్చుచు
సత్యాదరంబున నమ్మత్తకాశినిఁ బ్రసాదమేదురదరహసిత
లోచనంబుల వీక్షించి. 246

క. "జనకునకం బెను జననికిఁ
దనయులపై వత్సలత్వధర్మము మిగులన్
ఘన మంద్రు గాన నీకీ
యనుపమ కారుణ్య ముచిత మరవిందముఖి! 247

ఉ. అంబురుహాక్షి! నీపలికినట్ల యసంకుచిత ప్రభావధా
ర్ష్యంబున నేఁ బ్రవర్తిలుట సత్యము యైనను వారివారిక
ర్మంబులు చూడ కందఱ సమంబుగ నెవ్విధిఁ బ్రోవవచ్చు నెం
దుం బరికించిచూడ గుణదోషవివేక మనార్యకృత్యమే? 248

వ. ఆర్యానార్యకర్మంబు లేను క్రియాంగంబులు గాఁ గొనుట
కును దదుభయవ్యవస్థానిమిత్తం బైనవేదరూపాజ్ఞ లోకం
బున నిలుపుటకును గారణంబు మత్స్వాతంత్ర్యంబ; కావున
వారివారికర్మంబులవెంబడిన యేను శుభం బొనరించుట
స్వాభావికంబుగఁ దెలిసికొమ్మని యిట్లనియె. 249

క. విను మట్లైనను శుభవ
ర్తన కించుక బుద్ధి జనుఁడు దలఁకొల్పినమా
త్రన యది యే నీడేర్చుచు
ఘనకారుణ్యమునఁ బ్రోతుఁ గంజదళాక్షీ! 250

చ. సుకృతములందునుం బరమశోభన మైనమదర్చనాదిసి
ద్ధికి [1]ధరణీజనంబుల మదిం దలకొల్పన కాదె యేఁ గృపా
ధికత దశావతారసముదీర్ణవిహారము పూనుటల్ దురా
త్మకులకుఁదన్మహామహిమదర్శనముం గా వృథయేమి సేయుదున్.

వ. మఱియును, 251

క. అమృతపదప్రాప్తి కుపా
యములగు మత్పూజనాదు లఖిలజనులకుం
సమకూర్పనె యుండుదు ని
త్యము శ్రీరంగాదిదివ్యధామములందున్. 252

తరల. ఇదియుఁ జాలక యింకనుం గృప నెల్లజీవులఁ బ్రోవ నీ
మదిఁ గడుం దమకించితేనియు మానసంబున నాకు స
మ్మదము మిక్కిలి; యెంచి చూడ సమస్తజీవదయాళుతా
భ్యుదయ మెవ్వరి కింపు గాదు పయోజపత్రవిలోచనా! 253

వ. కావున నీప్రార్థనంబునం జేసి యిప్పు డొనర్చువిశేషంబు వినుమట్లు లోకానుగ్రహార్థంబుగా నేను నిత్యసన్నిధిస్థానంబులుగా నంగీకరించిన శ్రీరంగకాంచీవేంకటాచలాహోబలపురుషోత్తమాదిదివ్యస్థలంబుల కరిగి సేవింప నోపకున్నను దమయున్నచోటనే యుండి తత్తద్దివ్యదేశనివాసు నన్ను నిజేచ్ఛానుసారంబునఁ దలంచి కేలుమొగుచువారిని సంసారంబునుద్ధరింపఁ జేయుదు" నని యానతిచ్చిన సంతసిల్లి "యదియె చాలు" నని యమ్మహాదేవునిదీనవాత్సల్యంబు ననేకప్రకారంబుల సన్నుతించె" నని చెప్పి, మధురలాలస యాకళాపూర్ణమహారాజుఁ గనుంగొని యిది యిప్పుడు మీర లడిగిన

1. దలఁపుల్ జనం.

భవదీయపూర్వజన్మవిరచిత లక్ష్మీనారాయణసంవాద కథా ప్రకారంబు; దేవర ప్రశ్ననిమిత్తంబున నిశ్శ్రేయససులభోపాయంబు దొరకె; నేడు సుదినంబయ్యె; మదీయజన్మంబు సఫలంబయ్యె'' నని పలికి శ్రీరంగాదిదివ్యదేశమాహాత్మ్యంబు నకు వెఱఁగందుచు "నింత భక్తవత్సలుండవే!" యని పరమపురుషు నఖిలలోకైకనాథు నారాయణుఁ దలంచి ప్రణమిల్లె; గళాపూర్ణుండును దదాదిగా నత్యాదరంబున విష్ణుసేవ గావించుచు ధర్మమార్గంబున రాజ్యపరిపాలనంబు సేయుచు. 254

తే. సమ్మదము మీఱఁ దనయగ్రజాయయందు
మధురలాలసయందు నమర్త్యనిభుల
సుతులఁ గాంచెఁ గ్రమంబున సుప్రసాదుఁ
డనఁగ సరసుఁ డనంగఁ బెంపారు ఘనుల. 255

క. వల పమరఁగ నవవర్షం
బులసతిఁ దనకేళి కొదవి భోగక్రియ నిం
పల రెడునట్టుగఁ జేసెం;
దలఁపఁగ నిది చిత్ర మనఁగ ధర నతఁ డేలెన్. 256

తే. ఆయిలాతలవిభుమహనీయకీర్తి
పుండరీకంబుఁ బాయక యుండులక్ష్మి
వేడ్కఁ దాల్చినసంపంగివిరులబంతి
కరణిఁ గాన్పించు బ్రహ్మాండ మరసిచూడ. 257

ఉ. ఆయవనీశ్వరుం గవిమతు లాజి నెదుర్కొనుపాటివారు లే
రేయెడఁ; గల్గినం బ్రణము లించుక తద్బలపక్షకోటికిం
జేయఁగ లేరు; చేసినను జృంభితతన్మదకుంభికుంభవ(ం)

శ్యాయతనిర్ఝరికుచములందవియన్న ఖఘాతమాత్రముల్. 258

శా. తద్ధాటీసమయంబులం జటులగంధర్వాళిపాదాహతి
ప్రోద్ధూతక్షితిధూళి నింకెడుమహాంభోధిన్ ద్వీపమ్మండలీ
శుద్ధాంత ప్రమదావిలోచనము లశ్రుప్రౌఢిచేఁ గ్రమ్మఁగన్
వృద్ధిం బొందఁగఁ జేయు మీనసఖితావిఖ్యాతి సార్థండుగన్.

ఉ. రూపవిలాసవైభవనిరూఢిన కాదసమాస్త్రకౌశలుం
డాపృథివీశుఁ; డొండొకక్రియం బరికించిన మన్మథుండ యు
ద్దీపితకాంతుఁ దద్ధనురుదీర్ణవిహారముచేత శాత్రవ
క్ష్మాపతులన్ నిలింపపురకాంతల నొండొరుతోడఁ గూర్చుటన్.

ఉ. ధీరుఁడు శూరుఁ డక్షయవితీర్ణవిహారుఁడు బంధులోకమం
దారుఁడు నీతిమార్గసముదారుఁడు లోకపవిత్రకీర్తివి
స్తారుఁడు దోషదూరుఁడు నితాంతగభీరుఁడు నిత్యశోభనా
కారుఁడు ధర్మసారుఁ డవికారుఁడు తజ్జనపాలుఁ డెయ్యెడన్.

తే. అతనిగుణము లెన్నఁగఁ జతురాస్యుఁ డైన
నచతురాస్యుండు ధిషణుండు నధిషణుండు
ధర సహీనుండు హీనుండు దక్షముఖు ల
దక్షముఖు లని మఱి వేఱ తడవనేల? 262

ఉ. పూర్ణసమస్తసద్గుణవిభూషితుఁ డై పొలుపొందు నా కళా
పూర్ణుకథల్ విసం జదువఁ బొల్పగు సంతతి వైభవాదివి
స్తీర్ణశుభంబు కల్మి కజు దీవన మున్నది గల్గెఁ గాన నా
నిర్ణయ మార్యు లెల్ల మది నిల్పి వినుండు పఠింపుఁ డింపుతోన్.

ఉ. భవ్యత నెల్ల దేశములఁ బ్రస్తుతి కెక్కుచు మీఱి యిమ్మహా
కావ్యము సుప్రసిద్ధ మగుఁ గావుత నిత్యము సర్వలోకసం

_స్తవ్యనిజస్మృతికిఁ బెలయుతాండవకృష్ణుకృపకుఁ బవిత్రశా
స్త్రవ్యసనాతిధన్యు మగు సజ్జనకోటియనుగ్రహంబునన్. 264

శా. శ్రీరోచిష్ణుకటాక్షవీక్షజయలక్ష్మీసంతతాశ్లేష యో
గ్యారాజద్భుజ యారవీటిపురబుక్కక్షోణిపాలాన్వయ
క్షీరాంభోనిధికౌస్తుభాయితమహాస్థేమోదయప్రస్ఫుర
న్నారత్నావరపౌత్రగోత్రతిలకా నంద్యాలకృష్ణాధిపా. 265

క. శోభితవైభవ! రూపమ
నోభవ! కొండాంబికాతనూభవ! భూతి
శ్రీభవ! పరిశమితారి
ప్రాభవ! బుధవర్ణ్యమాన! రామసమానా! 266

వనమయూరము. శైలవరధీర! నిజసంగరపరిత్రా
ణాలఘువిచార! సకలాంగనుతగోత్రా
పాలనవిహార! యవిభంగజయయాత్రా
శీలనగధీర! నరసింగవిభుపుత్రా! 267

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళి యమరనార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామధేయప్రణీతం బైన కళాపూర్ణోదయంబను మహాకావ్యంబునందుఁ బ్రబంధపరిపూర్తిశోభనం బైనయష్టమాశ్వాసము సర్వంబును సమాప్తము.

---

చెన్నపురి: 'చంద్రికా' ప్రెస్సున ముద్రితము—1958.

# పద్యకావ్యములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అనంతునిఛందము, (ఛందోదర్పణము) | ... | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము, అబ్బయామాత్యునిది | ... | 1 | 0 |
| అప్పకవీయము, క్రొత్తకూర్పు | ... | అచ్చు. | |
| ,, శ్రీగిడుగురామమూర్తిపంతులవిమర్శ | ... | 0 | 12 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 4 |
| అన్యవాదకోలాహలము, ద్విపద, లఘుటీక | ... | 0 | 12 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము, 2 సంపుటములు | ... | 15 | 0 |
| ఆంధ్రమహాభారతము:— | | | |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు | ... | 1 | 8 |
| ,, టీక (పాతది) | ... | 8 | 0 |
| ఆదిపంచకము | ... | 11 | 4 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | ... | 7 | 8 |
| శాంతిసప్తకము | ... | 7 | 8 |
| ఆది సభాపర్వములు | ... | 4 | 0 |
| ఆరణ్యపర్వము | ... | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు | ... | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు | ... | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 4 | 0 |
| శాంతిపర్వము | ... | 4 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | ... | 4 | 0 |
| ఆంధ్రనామసంగ్రహము, మూలము | ... | 0 | 4 |
| ,, టీకతో | ... | 0 | 10 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆనందరంగరాట్ఛందము | ... | 2 | 8 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో | ... | 0 | 6 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబ నిఘంటువు (నిఘంటుత్రయము) కాలికో | ... | 2 | 0 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము— శ్రీజనమంచి శేషాద్రిశర్మగారిది, 3 సంపుటములు | ... | 15 | 0 |
| డిటో 7 సంపుటములు | ... | 18 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 1 | 4 |
| ఉత్తరరామాయణము, చక్కనికూర్పు | ... | 6 | 0 |
| ఉత్తరహరివంశము | ... | 8 | 0 |
| కవికంఠోక్తి | ... | 0 | 4 |
| కవిజనాశ్రయము | ... | 1 | 0 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవి | ... | 0 | 8 |
| కవిజనరంజనము | ... | 0 | 12 |
| కృష్ణదండకము | ... | 0 | 2 |
| కవిగజాంకుశము | ... | 0 | 4 |
| బేరీజుపద్యములు | ... | 0 | 4 |
| కృష్ణరాయవిజయము | ... | 0 | 12 |
| కాశీఖండము, శ్రీనాథునిది | ... | 3 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతం) | ... | 0 | 8 |
| డిటో గట్టుప్రభువుకృతము | ... | 0 | 12 |
| కుమారసంభవము, నన్నెచోడకృతము | ... | 5 | 0 |
| గజేంద్రమోక్షము, సటీక | ... | 0 | 10 |
| గయోపాఖ్యానము, రామనామాత్యకవి | ... | 0 | 12 |
| గయోపాఖ్యానము, ద్విపద(కృష్ణార్జునసంవాదము) గోపమంత్రిది | | 0 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| గద్యపద్యసంగ్రహము, విద్వాన్ జ. వే. సుబ్రహ్మణ్యశర్మ గారిది | 0 | 12 |
| ,, శ్రీ గొర్తి సూర్యనారాయణశాస్త్రి గారిది ... | 1 | 0 |
| గరుడాచలము - యక్షగానము, పెద్దచ్చు ... | 0 | 4 |
| గీతమంజరి, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము ... | 0 | 4 |
| చాటుపద్యమణిమంజరి ... | 1 | 12 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది ... | 1 | 8 |
| చెన్నబసవపురాణము ... | 2 | 8 |
| చెన్నపురీవిలాసము ... | 0 | 8 |
| ఛందోదర్పణము (అనంతునిఛందస్సు) ... | 2 | 0 |
| జైమినీభారతము ... | 2 | 8 |
| తెనుఁగుసమస్యలు ... | 0 | 3 |
| దశావతారచరిత్ర ... | 4 | 0 |
| దసరాపద్యములు ... | 0 | 3 |
| దేశింగురాజుకథ (జంగంకథ) ... | 0 | 8 |
| ధనాభిరామము ... | 0 | 12 |
| ధ్రువోపాఖ్యానము, సటీక ... | 0 | 12 |
| నరసభూపాలీయము, సటీక (కావ్యాలంకారసంగ్రహము) | 3 | 0 |
| నలోపాఖ్యానము, సటీక ... | 0 | 12 |
| నలచరిత్ర, ద్విపద, క్యాలికోబైండు ... | 2 | 4 |
| నాచికేతోపాఖ్యానము, మల్లికార్జునకవి ... | 1 | 0 |
| నిర్వచనోత్తరరామాయణము ... | 2 | 8 |
| నిరంకుశోపాఖ్యానము ... | 0 | 12 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము ... | 0 | 12 |
| పంచతంత్రము, వేంకటనాథరాజకవి ... | 2 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోస్టుబాక్సు, 1372. 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి 1.

## కళాపూర్ణోదయము

# కథాసంగ్రహము

### ప్రథమాశ్వాసము

ద్వాపరయుగమున శ్రీకృష్ణుఁడు ద్వారకానగరమును పాలించునప్పుడా నగరమున ఉత్తమవేశ్యాకులమున జనించిన కలభాషిణి యను సౌందర్యవతి యగు యువతి నివసించుచుండెను. ఒకనాఁ డామె చెలికత్తెలతోఁగూడ తన భవనముచేరువఁ గల పూఁదోఁటలో నుయ్యేల లూఁగుచుండఁగా నారదమునీంద్రుఁడు శ్రీకృష్ణసేవాలాలసుం డగుచు తన శిష్యుఁ డగు మణికంధరుఁ డను గంధర్వకుమారునితోఁగూడ నాకాశమార్గమున వచ్చుచు వారిం గాంచెను. అపుడు మణికంధరుఁడు ఆ యువతు లుయ్యేల లూఁగుచు కాళ్లు మీఁదికి చాఁచుట రంభాద్యప్సరసలను కయ్యమునకుఁ బిల్చుచున్న ట్లున్నదని వర్ణించెను. నారదుఁడును వారిం బ్రశంసించెను. ఆ సమయమున విమానము నెక్కి యా ప్రక్కనుండి పోవుచున్న రంభానలకూబరులలో రంభ యా ప్రశంస విని నలకూబరునితో 'అవి నారదమహర్షి మాటలవలె నున్నవి; అతనిం గౌరవించి వెళ్లుట మే'లని పల్కినది. నలకూబరుఁడును వల్లె యనెను. పిదప వారు విమానమును నారదునిపాదములక్రిందుగా నడిపించి యభివాదన మొనర్చి దీవన లందిరి. 'వారిప్రార్థనచొప్పున నారదుఁడు శిష్యునితోఁగూడ వారివిమానము లోనికి వచ్చి వారిసేవ లందసాగెను. అపుడు రంభ నారదునితో 'మునివరా! మీ రింతకు ముందు ఊయెల లూఁగు యువతులను ప్రశంసించుట యతిశయోక్తియా? యథార్థమా? మీ కే మన్నను చెల్లును; కాని నాతో సరివచ్చు

నందకత్తెలు లే రనుటకు జగన్మోహనమూర్తి యగు నీ నలకూబరుఁడే సాక్షి.'' అని పలికెను. నారదుఁడు మెల్లగ నవ్వుచు 'మును ముం దెట్లు జరుగునో ఎవ్వరు చెప్పఁగలరు? నిటుఁ బోలు యువతి నీకును, ఇతనిం బోలు యువకుఁ డితని కిని ప్రతిగా నేర్పడినచో నేమగునో యోచించితివా?' అని పల్కెను. రంభ తాను నవ్వులాట కట్లంటి ననియు, ఇఁక నా విషయమును విడువవలె ననియుఁ గోరి యతనికి మ్రొక్కెను. మునివరునికోరిక ప్రకారము కలభాషిణిపూఁ దోఁటలో నాతనిని దింపి రంభానలకూబరులు యథేచ్ఛం జనిరి.

కలభాషిణి యంతకు మున్నే యా విమానములో నున్న రంభానల కూబరుల సల్లాపములు విని, నలకూబరుం గాంచి యతని రూపలావణ్యాది సౌభాగ్యమున కచ్చెరువడి, యా యిర్వురును రంభానలకూబరులు గానోపుదు రని యూహించి యథార్థమును నారదునివలనఁ దెలిసికొనఁ దలఁచెను. ఇట్లు నిశ్చయించి కలభాషిణి నారదున కెదు రేఁగి నమస్కరించి 'ఓ సంయమివరా! ఆ విమానమున నున్నవారు రంభానలకూబరులే గదా!' అని యడిగెను. నారదుఁడు 'అవును; వారు రంభానలకూబరులే! కాని నీ వెట్లు తెలిసికొంటివి?' అని యడుగఁగా నామె 'విమానమున మీ రాడుకొను మాటలంబట్టి గ్రహించితి' ననెను. 'ఓహో! నీవు మా ప్రసంగమును వింటివా?' అని నారదుఁడు ప్రశ్నింపఁగా కలభాషిణి ''వింటిని; ఆమె తన చక్కఁదనముచే నాతనిని వశపఱచుకొన్నట్లు పల్కఁగా మీ రామెమాటలను సహింపనట్లును తోఁచెను'' అని పల్కెను నారదుఁడు 'నిజమే! ఎంతటివారికిని 'తనయంతవారు లే'రను గర్వము తగదు. ఈ రంభ సవతికయ్యమునకు గురి కానున్నది; కొంత ప్రాప్తి యున్నచో నీవే యామెకు సవతివి కాఁగలవు.' అనెను. కలభాషిణి 'లోకోత్తరసౌందర్యవతికిఁ గాని యట్టి యదృష్టము పట్ట'దనెను. 'కలభాషిణిసౌందర్యము రంభాదుల చక్కఁదనమున కేమాత్రము తీసిపో'దని పల్కుచు నతఁడు కలభాషిణి కలభాషిణి యగుటయుఁ శ్రీకృష్ణుని సభకు రాకపోకలు సేయు

టయుం, తన శిష్యుఁడగు మణికంధరుఁడు శ్రీకృష్ణునిపైఁ జెప్పిన దండకము నామె ఏకసంథనే గ్రహించి పఠించుటయు గుర్తించి దాని నొకసారి చదువఁ గోరఁగా ఆమె యట్లే చదివి యాతనిని మెప్పించెను. మఱియు నామె 'ఈ దండకరచనకు మెచ్చియే కదా శ్రీకృష్ణుఁడు మీ శిష్యునికి రత్నకంఠహారము నిచ్చుట' అనియుఁ జ్ఞప్తికిఁ దెచ్చి, 'మీవంటివారి చేరువ నున్నచో నెట్టి కోరిక లైనను సిద్ధింపఁగలవు. నేనును మీ వీణ మోయుచు సేవ చేయఁదలంచు చున్నాను. మీరు శ్రీకృష్ణుని యంతఃపురమునకుఁ బోవునపుడు శిష్యుని ముంగిట నిల్పి, అతనిదగ్గఱనుండి వీణ గ్రహించి మీరే మోయుచు లోనికిఁ బోవుట నేఁ జూచుచుందును. నేను దానిని మోసికొని లోనికి వచ్చుట కభ్యంతర ముండదనుకొందు'నని వినయమునఁ బ్రార్థించెను. దానికి నారదుఁడును సమ్మతించెను. దానివలనఁ దన కోరికయుం సఫలమగు నని యామె సంతసించెను. పిదప నామె మణికంధరుఁడు కొంత దూరముగా తొలఁగుట గమనించి నారదునితో 'మహాత్మా! ఆ విమానము పోవునపుడు కొన్ని మాటలు వినవచ్చినవి. నలకూబరుఁడు 'కళాపూర్ణుని కడమ వృత్తాంతమును తెల్పు'మని రంభ నడుగఁగా ఆమె 'ఆ కథ చెప్పరానిది; చెప్పఁదగియే యున్నచోఁ జెప్పి యుండెడిదాననే! నీకుఁ జెప్పినంతవఱకును కూడ ఎవ్వరికిని తెల్పరా'దని పలికెను. ఆమె చెప్పిన వృత్తాంత మేమియో, ముందుకథ తెలుపకుండుటకుఁ గారణ మేమో తెలిసికొనఁ గుతూహలపడుచున్నాను. దయచేసి తెల్పఁ గోరెద" ననెను. నారదుఁడును తన దివ్యదృష్టిచే సమస్తము తెలిసికొని "అయ్యది తెలుపరానిది" అనెను. కలభాషిణి 'పోనిండు. ఆ ప్రసంగ మేల వచ్చెనో చెప్పుఁ'డనెను.

అంత నారదుఁ డిట్లు తెల్పెను:—"విమానమున నేగుచు నన్నుఁ జూచుటకు మున్ను బాలసూర్యుని ప్రక్క తెల్లని మేఘరేఖ యుండుటఁ జూచి రంభ నవ్వుచు 'బ్రహ్మతో నున్న సరస్వతివలె నున్న'దని పల్కెను. నలకూబరుఁ

దమ్మాటకుఁ జొక్కి యామె మోవిని దంతక్షత మొనర్చెను. రంభ కెక్కువ తమి కల్గఁగా, ఆమెకంఠమునుండి అప్రయత్నముగా కొన్ని మాటలు వెలువడెను. నలకూబరుఁ డామెను బుజ్జగించుచు బలవంతముగా నామెచేఁ గొంత వృత్తాంతము చెప్పించెను. ఆమె కొంత కథనే చెప్పి యాపైఁ జెప్పక 'ఈ కథ చెప్పినవారును, విన్నవారును భూమిపై పుత్రపౌత్రాభివృద్ధితో పెక్కుకాలము సౌఖ్యము లందుచుందు రనెడి నియమ మున్నదికాన దానిం జెప్పరా' దనెను. రంభకుఁ గల్గిన భయమే నాకును కలదు. కావున నేనును చెప్పరాదు. అయిన నియ్యది భూలోకమున వ్యాప్తిఁ జెందఁ గలదు; దానికి మార్గములును కలవు' అని పలికి యతఁడు తన శిష్యునితోఁగూడ శ్రీకృష్ణునిమందిరమున కేఁగెను. కలభాషిణియుఁ జెలులతోఁగూడ నింటి కేఁగి సింగారించుకొని శ్రీకృష్ణునినగరి కేఁగెను.

## ద్వితీయాశ్వాసము

సవతిపోరు కల్పించి, గర్విత యగు రంభకు శృంగభంగ మొనర్చుటకుఁ గలభాషిణి తగి యున్న దని నారదుఁడు లోలోన సంతసించుచు మణికంధరునితోఁ గూడ శ్రీకృష్ణుని కొల్వుకూటమువైపు పోయెను. ఇతనిరాకను దూరము నుండియే అంతఃపురపరిచారికలు గమనించి శ్రీకృష్ణునికి విన్నవింపఁగా దేవదేవుఁడు ససంభ్రమమున వచ్చి నారదుని గౌరవించి సమీపమునఁ గల యొక మణిసభాభవనమునకుఁ దీసికొని పోయి యిష్టాగోష్ఠి నుండెను. అచటికి రాఁదగిన సభ్యులు బయట నుండి తమ రాకను తెలియఁజేయఁగా నారదుఁడు వెళ్లిన పిదప రాఁగోరెను. కాని నారదుని ప్రార్థనపై వారికి దర్శనం బొసఁగి శీఘ్రముగ కొల్వు చాలించి యతనితోఁ గూడ నంతిపురి కేఁగెను. నారదునివెంట బహిర్ద్వారమువఱకు మణికంధరుఁడు వీణెను మోసికొని వెళ్లెను. పిదప నా వీణెను నారదుఁడు గైకొనఁగా, కలభాషిణి దాని నాతనిచేతినుండి గ్రహించెను. శ్రీకృష్ణుఁడది చూచి యల్లన నవ్వుచు 'ఓహో! నీవు నారదుల శిష్యత్వము

లభించెనా? మేలం' ఇదియుం నదృష్టము! ఈయనయనుగ్రహము కల్గిన నీకు గొప్ప విద్య యలవడు నని నే ననుకొనుచుంటిని. అట్లే యనుకూలపడిన' దని పల్కుచు నామెతోఁగూడ నారదుని జాంబవతీసతీగృహమునకుఁ దీసికొని పోయి యామెతో 'నీ కొక శిష్యురాలిం దెచ్చితి'నని పలికెను. జాంబవతియుం 'నాతో నిదివఱకుఁ జెప్పిన కలభాషిణియేనా యామె?' యనుచు వినయ పూర్వకముగ నారదమహర్షికిఁ బరిచర్య లొనర్చెను. పిదప శ్రీకృష్ణుఁడు తన సతిని 'ఈ నారదమహర్షి తుంబురుని గెల్వఁగోరి నీయొద్ద గానవిద్యావిశేష ముల నభ్యసించుచుండెఁగదా! ఎంతవఱకు చక్కఁదిద్దితివి?' అని ప్రశ్నింపఁగా నామె 'మీరు చెప్పినట్లే చేయుచున్నా'నని తన నైపుణ్యమును ప్రదర్శించుచు వీణం బుచ్చుకొని శ్రీకృష్ణుని నుతించుచు నత్యద్భుతముగా పాడెను. నార దుఁడు శ్రీకృష్ణునియానతి నామెకడ ఒక సంవత్సరకాలము రుక్మిణీసత్యభామల యొద్ద చేరి యొక సంవత్సరము శ్రీకృష్ణునియొద్ద నొక యేఁడు గానవిద్యా రహస్యములను నేర్చి పరిపూర్ణపాండిత్యమును సంపాదించెను. కలభాషిణియుం గొప్పవిదుషి యయ్యెను. శ్రీకృష్ణుని యనుగ్రహమున మణికంధరుఁడును గొప్ప సంగీతవిద్వాంసుఁ డయ్యెను.

శ్రీకృష్ణుని యంతిపురిలోని కాంత లెల్లరును నారదుని పాండిత్యమును మిగుల ప్రశంసించిరి. వారు యథార్థముగనే తన్ను ప్రశంసించుచున్నారో, ముఖప్రీతి కనుచున్నారో తెలిసికొనుట కుపాయ మాలోచింపసాగెను. 'తాను కోరిన యువతిరూపము ధరింపఁగల వర మొసఁగినచో, అచటి చెలికత్తెలలో నొక తెరూపు ధరించి యథార్థమును గుర్తెఱిఁగి వత్తు'నని కలభాషిణి తెల్పెను. కలభాషిణి యీ నెపమున రంభరూపము ధరించి నలకూబరుని పొందుఁ బడయఁ గోరుచున్న దని నారదుఁడు గ్రహించియు స్వకార్యసిద్ధికయి యామెకా వరము నొసఁగెను. ఆమెయు శ్రీకృష్ణునంతఃపురమున కేఁగి యచటి కాంతల ప్రశంస యథార్థమైనదే యగుటను తెలిసికొని నారదున కా సంగతిని తెలి

పెను. నారదుఁడును మిగుల సంతసించి కలభాషిణితో "నీ విదివఱలో మనములో రంభామనోహరాకారు పొందఁ గోరియున్నదానవు; కావున అది నీకు సిద్ధించు"నని పల్కి యామెను పంపివేసి, మణికంధరుని దీర్ఘయాత్ర చేయ నియోగించి యథేచ్ఛం జనెను.

ఒకనాఁడు కలభాషిణీ యొక్కతెయు గృహారామమున వీణ మీటుచు పాడుకొనుచుండఁగా నొక సిద్ధుఁడు సింహవాహన మెక్కి యాకాశమార్గంబున నచటికి వచ్చి యామెవలన నర్ఘ్యపాద్యాదు లంది "ఓ కలభాషిణీ! నీవు కృష్ణుని సేవింప నేఁగుచున్నావా? నారదుఁ డింక రాకపోకలు మానెనుగదా! నీమనస్సు నలకూబరునియందు లగ్నమై యున్నదికదా! మణికంధరుఁడు తపస్సునకుఁ బూనినది మొదలింపైన పాటయే వినరాలేదు. నీవు కొంచెము సేపు పాడి కర్ణరసాయనము చేయుము. ఏమన—పాటలో మీ యిర్వురిని మించినవారెవ్వరును లేరుకదా!" అని పల్కెను. కలభాషిణి యీ మాటలు విని మిక్కిలి యాశ్చర్యముతో నతనిని దేవతాగణములో నొక్కనిఁగా భావించి యతని వృత్తాంతము వినఁగోరెను. అతఁడు

'నేను మణిస్తంభుఁడను సిద్ధుఁడను. నాకు దూరశ్రవణ, దూరదర్శన శక్తులు కలవు. తన్మూలమున ఉన్నచోట నుండియే సమస్తవిషయములను కని, విందును' అని చెప్పెను. అంత కలభాషిణి 'ఇంతవఱకును మీరు చెప్పినది సరిపోయినది; మణికంధరుఁడు తపస్సు చేయుచున్నట్లు మీరు చెప్పితిరిగదా! ఆ మీఁది వృత్తాంతమును తెల్పఁ బ్రార్థించుచున్నా'నని కోరఁగా మణిస్తంభుఁ డిట్లు చెప్పఁదొడంగెను—

"గానశిక్షా పరిపూర్తి యైన వెనుక నారదుఁడు నిన్ను నీ గృహంబున కనిపి, మణికంధరునితో 'నీసంగీతకళాభ్యాసము సఫలమగునట్లు మిక్కిలి యాసక్తితో విష్ణువును సదా కీర్తించుచుండుము. నేనును సంగీతమునుగూర్చి నా పడినపాట్లు సఫలము లగునట్లు స్వర్గకైలాససత్యలోక వైకుంఠములలో

నెచటనైనను గర్వితుఁడగు తుంబురుని గెల్వఁబోయెద' నని పల్కెను. 'తుంబురుని గెల్వవలెనను పట్టుదల. మీ కేల కలిగె?' నని మణికంధరుఁ డడుగఁగా నారదుఁ డిట్లు చెప్పసాగెను.

'ఒకప్పుడు మహావిష్ణువు కౌండిన్యాది మహామునులతోను, దేవగణములతోను కొలువుతీర్చి యుండఁగా నేనును, తుంబుర్వాదులగు గాయకులు నట నుంటిమి. ఆ సమయమున లక్ష్మీదేవి చెలికత్తెలతోఁగూడ నా సమీపమునందలి యుద్యానవనమునుండి యచటికి వచ్చెను. అప్పుడు వేత్రహస్తులు సభలోనివారి నందఱిని దూరముగాఁ దరిమివేసిరి. బ్రహ్మయు నా స్థలము విడిచి పోయె ననఁగా మావంటివారి సంగతిని వేఱే చెప్పనక్కఱలేదు. ఇట్లందఱును దూరముగాఁ బోగా, వేత్రధరులు తుంబురునిమాత్రము లోనికిఁ బిల్చుకొని పోయిరి. మహావిష్ణువు లక్ష్మీదేవితోఁగూడ నతని గానమును వినుటకు తుంబురుని పిలిపించి యుండు నని తలంచితిని. అతనిపాటయు వినవచ్చెను. కొంతసేపైనపిదప తుంబురుఁడు మహావిష్ణు వొసంగిన బహుమానములను గైకొని వచ్చెను. మే మందరము నుండఁగా తుంబురుఁడే పిలిపింపఁబడుటయు, అతఁడు మాతోఁ జెప్పకుండ పిలుపు వచ్చిన వెంటనే పోయి పరాత్పరుని మెప్పించి బహుమానము లంది వచ్చుటయు నాకు మిక్కిలి యసూయను గలిగించెను. ఎక్కడనైనను తుంబురునితో వాదుపెట్టుకొని యతని నోడించి మదీయసంగీతచాతుర్యము భగవంతున కెఱుకపడునట్లు చేయవలె నని సంకల్పించుకొంటిని. ఇట్లు నిశ్చయించి గానములో నతని గుణదోషములను దెలిసికొనుటకై యొకనాఁడతనియింటి కేఁగితిని. అప్పు డాతఁడు పాటకు సిద్ధముగా వీణెను మేళవించి మొగసాలలో నుంచి లోని కేఁగి యుండెను. నే నా వీణెను పుచ్చుకొని పలికించి దాని యపూర్వ మేళనమున కబ్బురమంది లజ్జించి వెనుకకు వచ్చితిని. పలుచోట్ల గానవిద్యానిపుణులను బరికించి, అం దెవ్వరును తుంబురున కీడు కారని తెలిసికొని, భగవంతుని యనుగ్రహముననఁగాని నా కోర్కె ఫలింపనేర దని నిశ్చయించి

మహావిష్ణునిఁగూర్చి చిరకాలము తపం బొనర్చితిని. అంత నాతఁడు ప్రత్యక్షమై 'నీకోరిక యిప్పుడు నెఱవేఱదు. నేను ద్వాపరమున వసుదేవునకుఁ బుత్త్రుఁడనై జనించి ద్వారకానగరమున నీకోర్కె నెఱవేర్పఁగలవాఁడను; నీవప్పు డచ్చటికి రావలె'నని పల్కి యంతర్ధానమొందెను. ఇప్పటికి నా కోరిక నెఱవేఱినది. నే నిన్ని పాట్లు పడి యీ గానవిద్యను సంపాదింపఁగా, మీ రెట్టి కష్టము లేక గ్రహించితిరి.'

ఇట్లు నారదుఁడు పల్కఁగా మణికంధరుఁడు 'మహాత్మా! ఒక్కసారి తుంబురుని పిలిపించి మహావిష్ణువు పాట వినుటయే మిక్కిలి గొప్పగా మీరు చెప్పుచున్నారు. సదా వైకుంఠమున నివాస మబ్బుట ఎట్టి పుణ్యాత్ములకో గాని కలుగదుకదా!' అని పల్కఁగా 'ఔను. నిజమే' యని నారదుఁడు నంగీకరించెను. మఱియు భగవత్సాన్నిధ్యమున కనువగు పద్ధతులను వివరించి చెప్పెను. మఱియు శ్రీకృష్ణునను గ్రహంబున లభ్యమైన అనన్యసాధారణసంగీతచాతుర్యంబును వృథసేయక పుణ్యక్షేత్రములందు ముకుందుసన్నిధిని తద్దివ్యనామసంకీర్తనంబు గావింపవలె నని బోధించెను.

తదానతి ననుసరించి మణికంధరుండు ఆసేతుహిమాలయము వివిధపుణ్యక్షేత్రములను సేవించి అనంతశయనంబునఁ గొన్నినాళ్లుండెను. పిదప నొక వనమున హరిఁగూర్చి తపం బొనర్చుచున్నాఁడు; ఇపుడు పద్మాసనస్థుఁ డయి యున్నాఁడు".

మణిస్తంభుఁ డిట్లు చెప్పఁగా అచట నొక చెట్టుపై నున్న చిలుక యొకటి 'యీతఁడు చెప్పిన దంతయు సత్యమే' యనుచుఁ దన వృత్తాంతము నిట్లు చెప్పెను.

'నా నివాసము నందనవనము. పారిజాతవృక్షమును శ్రీకృష్ణుఁ డీలోకమునకుఁ దెచ్చునపుడు గర్భభరాలస యగు నా భార్య కదలి పోలేక యా వృక్షముతో భూమి కేఁగుదెంచెను. మే మిచట నున్నను స్వర్గబంధువులను

జూచుటకై నేను రాకపోకలు చేయుచుందును. నేడు నేను స్వర్గములోని నందనమున నుండఁగా శచీపురందరులచటికి వచ్చిరి. అపు డొకచారుఁ డింద్రుని కడకు వచ్చి మణికంధరుని ఘోరతపశ్చర్యను వివరింపఁగా ఇంద్రుఁడు తత్తపో విఘ్నం బొనర్చుటకు రంభను బిలిపించి, మణికంధరుని వశమొనర్చుకొనుట కనువుగా నామెసౌందర్యమధికమగునట్లు వర మొసంగెను. ఈపాటికి రంభాదు లాతని తపోవనమును జేరియుందురు.'

కలభాషిణి యీ చిలుకపలుకులు విని యచ్చెరువొంది, దానిని మిగులఁ గొనియాడి సాగనంపెను.

## తృ తీ యా శ్వా స ము

మణిస్తంభుని కోరికమేరకు కలభాషిణి వీణను గ్రహించి మధురముగా గానమొనర్చెను. అంట రంభాదులును మణికంధరునియొద్దకుఁ జని యతనిని వశ పఱచుకొనిరి. అతఁడు రంభతో నొక పొదరింటియందు మన్మథక్రీడల వినో దించుచుండెను.

• కలభాషిణి మణికంధరునితపంబుచందం బే మయ్యె నని మణిస్తంభునిఁ బ్రశ్నింపఁగా, 'అతఁడు రంభతో వినోదించుచున్నాఁ'డని సమాధానము వచ్చెను. కలభాషిణి మణిస్తంభుని మహిమ కద్భుతమొంది తమయింట రెండు మూఁడు దినము లుండి యాతిథ్యమును గ్రహింపవలె నని వేఁడగా 'సిద్ధులు గృహస్థుల యిండ్ల నుండ రా దనియు, రహస్యపద్ధతినైన నుండెద ననియుఁ జెప్పి యామె యాతిథ్యమును గ్రహించుచు నట నుండెను. ఒకనాఁడు కలభాషిణిమనస్సు నలకూబరుపై పోఁగా, అతనివృత్తాంతమును రంభావృత్తాంతవ్యాజమునఁ దెలిసికొనఁగోరి 'మణికంధరుఁ డింకను రంభతో వినోదించుచున్నాఁడా?' అని సిద్ధునిఁ బ్రశ్నించెను. అతఁడు దివ్యదృష్టింజూచి 'రంభ మణికంధరునితో వినోదించుచుండియు, నలకూబరునే స్మరించుటచే మణికంధరునిమనస్సు చివుకు...మ'ని నసెను. ఆమె నలకూబరుని వృత్తాంత మడుగఁగా సిద్ధుఁడు

'నీ కిది యేగదా ముఖ్య'మని పల్కి 'నలకూబరుఁడా చేరువనే రంభరాకకై యెదురుచూచుచున్నాఁ'డనెను. ఇట్లు పల్కి యాతఁడు పోనుండఁగా నామె 'స్వామీ! మీరు గొప్ప ప్రభావము కలవారు. ఎట్లయినను నేఁడు న న్నాతని యొద్ద చేర్పవలె'నని ప్రార్థించెను. మణిస్తంభుఁడును ద్వారకనుండి చాల దూరమున నున్న అనంతశయనము సమీపమునకుఁ దీసికొనిపోవుట అసాధ్యమే; అయినను తన సింహవాహనముపై వెనుకప్రక్క మరగొమ్మునూఁతఁగాఁ గొని కూర్చుండి వచ్చినచో నాలుగుగడియల కాలములో నలకూబరుఁ డున్న చోటికిఁ దోడ్కొని పోఁగల ననియుఁ జెప్పెను. దానికి కలభాషిణి సమ్మతింపఁగా నిర్వురును యోగసింహము నెక్కి పోవుచుండఁగా వారికి రంభ చెలిమికత్తె లెదురుపడిరి. వారిం గాంచి 'రంభ యెక్కడ? ఆమె మణికంధరునితో నున్నదా?' అని మణిస్తంభుఁడు ప్రశ్నింపఁగా 'ఆమె నలకూబరునితోఁ గలిసి విహరించుచున్న' దని పలికి వారు వెడలిపోయిరి. ఈమాట విని కలభాషిణి విచారించుచున్న ట్లుండఁగా—'విచారింపకుము; నీమనస్సులోని విచారమంతయుం నొకించుకసేపులోఁ బుచ్చివైచెద'నని మణిస్తంభుఁడు పలికెను. ఇంతలో వాహనమైన యా సింగము ఎంత యత్నించి త్రోలినను ముందునకుఁ బోక గర్జింపసాగెను. సిద్ధుఁడు 'మగువా! ఈ క్రిందుగా మృగేంద్రవాహన యను మహాశక్తిమందిర మున్నది. తదగ్రభాగమునఁ గల సింహమునకుఁ గ్రింద మీఁద చుట్టుపట్ల నెట్టిబెట్టిదపు సింగంబులైనఁ జన వెఱచును; అది నే మఱచితిని. మన మా శక్తి కభివందనముచేసి పోయినచోఁ గార్యసిద్ధి యగు' నని పల్కి వాహనమును నేలకు దింపి, ఎలుగుతోలియొఱలోని కత్తిం బుచ్చుకొని కలభాషిణితోఁగూడ వాహనమునుండి దిగి, యా సింగము నొకయెడ దాఁచి దేవీపూజకయి పూవులందేర పూఁదోఁట కరిగెను. కలభాషిణిని అచటి బయటి మండపమున నుండ నియోగించెను.

అప్పు డచట నున్న ముసలిముదిత యొర్తు కలభాషిణిని సమీపించి 'అయ్యో! బావురుపిల్లికిం జిలుక చిక్కినట్లీ దురాత్మునికి నీ వెట్లు చిక్కితివి?

వేవేగము యిచటినుండి వెడలిపొమ్ము. లేదేని అతఁడు నిన్ను సంహరింపక మానఁడు' అని పలికెను. కలభాషిణియుం "ఇచటికి వచ్చునపుడు—ఇంక నొకింతసేపటిలో నీవగ పెల్లు తీర్చివైచెద నని చెప్పినందున నీపెమాట నమ్మఁదగి యున్నదని యనుకొని, తొందరపడి తా నతనివెంట వచ్చినందులకు మిగుల విచారించి, యామెతో 'అమ్మా! నే నెచటికిఁ బోఁగలను? ఎట కేఁగినను నీతఁడు నన్ను దూరదృష్టిం జూడఁగలఁడు.' అని యతఁడు తన్ను చూచినది మొదలు కొని యంతవఱకును జరిగిన వృత్తాంతమును తన రాకకుఁ గారణమును తెల్పెను. ముసలియామె 'వీఁడు తనకు లభించిన దూరశ్రవణ, దూరదర్శనశక్తులతోఁ బాటు రాజ్యసంపదనుగూడ బొందఁదలంచి తత్సాధనకై గొప్ప గానకుశలయుం నందకత్తెయుం నగు వేశ్యాయువతికొఱకు వెదకుచుండుట నే నెఱుంగుదు' ననెను. 'ఈ లభించిన దూరశ్రవణ, దూరదర్శనశక్తులకై వీఁ డెందరి గొంతుకలు కోసెనోగదా!' అని కలభాషిణి యనఁగా ఆమె 'వానికై సాహసకార్యము లావశ్యకములు; కాని ఎవ్వరిని చంపనక్కఱలే' దని చెప్పుచు కలభాషిణి నచటి మండపముదగ్గఱి శిలాస్తంభమువద్దకుఁ దీసికొని వెళ్లెను. ఆ స్తంభమునకు రెండు శస్త్రములు వ్రేలఁగట్టఁబడి యుండెను. అచట నొక చురకత్తియుం, గండకత్తెరయును గలవు. ఆ స్తంభముపైఁగల వ్రాఁతను కలభాషిణి యిట్లు చదివెను.

'(1) ఇచట రెండేండ్లు జితేంద్రియత్వమున భువనేశ్వరింగూర్చి తపస్సు చేసినఁ గోరిన కోర్కెలు సిద్ధించును. అట్లు కాక సద్యస్సిద్ధి నపేక్షించుచో (2) ఈ గోరుగంటఁ గన్ను లూడఁబెరుకుకొన్నచో దూరదర్శనశక్తియు, (3) నారసమును చెవులలో జొనుపుకొన్నచో దూరశ్రవణశక్తియు, (4) చురియతో నాలుకం గోసికొన్నచో నద్భుత కవిత్వశక్తియుఁ గల్గును. (5) గండకత్తెరతోఁ దల నుత్తరించుకొన్నయెడల ఆ తల మఱల నదుకుకొని జీవించుటయే గాక తన్ను జంప యత్నించువానిని జంపు శక్తియును గల్గును. (6) రాజ్యసంపద కావలసినచో, రూపమునను, గానమునను సాటిలేని వారవధూటి

నీ దేవికి బలి యీయవలెను. (7) ఈ పై విధులలో దేనికిని శక్తి లేని వృద్ధు లిచట ఏ విధముగ దేహమును చాలించినను వారికి వెంటనే, యౌవన, రూప సిద్ధి యగును; వారు తలంచిన కోరికయు నెఱవేరును.'

ఇట్లామె చదివి తన మరణ మెట్లును నిశ్చయమని ధైర్యమున నుండెను. కడపటిది చూచియే తా నిచట నున్నట్లు వృద్ధురాలు చెప్పెను. ఆమె తనపేరు సుముఖాసత్తి యనియు, నివాసము కాశ్మీరదేశమందలి శారదాపీఠ మనియు, అచట సరస్వతీదేవిని పూజించు పూజారిబ్రాహ్మణుని పుత్రిక యనియు తన సంగతిని తెల్పెను.

ఇంతలో మణిస్తంభుఁడు పూవులు తెచ్చి 'గుడిలోనికిఁ బోయి దేవిని పూజించి మఱల బయలుదేరుద'మని కలభాషిణిని పిలువఁగా, ఆమె తనతోఁ గూడ సుముఖాసత్తిని లోనికి రాఁగోరెను. తనసంగతి వృద్ధురాలివలన కలభాషిణి గ్రహించినదని యనుమానించి విలంబమైనచో విఘ్నమగునని శంకించి నీ కీ ముసలివ గ్గట్లు తోడుపడునో చూచెదఁగాక!' యని కలభాషిణికొప్పు పట్టి యీడ్వఁబోఁగా నామె తన్ను రక్షింపవలెనని సుముఖాసత్తిని ప్రార్థించెను. సుముఖాసత్తియు నడ్డుపడెను. 'నీవీమె నడ్డి లోనికి రానీయకున్నచో నిచటనే బలికార్యము నెఱవేర్చెద'నని యాతఁడు కత్తి నెత్తఁగా 'ఈమెను వ్రేసినచో దేవిపై నొట్టుసుమా!' అని పల్కుచు సుముఖాసత్తి 'తనమాట సత్యము చేయవలె'నని దేవిని ప్రార్థించి, కలభాషిణికంఠమునకుఁ దన కంఠము నడ్డముగా నుంచెను. సిద్ధుఁ డతిరోషంబున నేమియు లెక్కసేయక సుముఖాసత్తికంఠమును ఖండించి కలభాషిణిం గూడ వ్రేయ సిద్ధపడఁగా దేవి యాతని వలిదూరంబునఁ బడవైచెను. అతఁ డొకచేతఁ గత్తిని, వేఱొకచేతఁ గలభాషిణికొప్పును బట్టుకొని యున్నందున ఆమెతోఁగూడ నాకాశమున కెగిరెను. మరణానంతరముననే సంప్రాప్తయౌవనయైన సుముఖాసత్తి దీని నంతను జూచుచునే యుండెను. ఆమె కలభాషిణియవస్థకుఁ విచారించియుఁ జేయునది లేక భక్తితో దేవిని ధ్యానించుచు నచటనే యుండెను.

ఇంతలో నచటికిఁ గలభాషిణి వచ్చి సుముఖాసత్తిని గాంచి యామె యెవ్వతెయో చెప్పఁగోరెను. ఆమెః తాను సుముఖాసత్తినే యని చెప్పి సిద్ధునితోఁగూడ నాకాశముపై కెగిరిపోయిన కలభాషిణినొవ్వకుండఁ దిరిగి వచ్చుట యాశ్చర్యకర మని యనుచు నామెవృత్తాంతమును వివరింపఁగోరెను. అపుడు మణికంధరుఁ డచటికి వచ్చి కలభాషిణిని జూచి యచ్చెరువొంది ద్వారకావృత్తాంతమును, నారదుని రాకపోకలను గూర్చియు, తన దండము నామె మఱి యెవ్వరికైనను వినిపించిన సంగతిని ప్రశ్నించెను. మఱియు నామె మనస్సులోని కోరికనుబట్టి గానమును కట్టిబెట్టలేదుగదా! యనియు నడిగెను. కలభాషిణియు, తన మనస్సులోని కోరికయే తన్నింతకుఁ దెచ్చినదని మణిస్తంభుఁడు తన్ను మోసగించిన విధమును, సుముఖాసత్తి రక్షించిన తెఱంగును వివరించి మణికంధరుని వృత్తాంతము నడిగెను. ఇంతలో మణిస్తంభుఁడు కూడ నచటికిరాఁగా మణికంధరుఁడాతనిని సవినయముగ గౌరవించెను. మణిస్తంభుఁడు కలభాషిణిని జూచి 'నిన్ను వెదకియు నెందును గాననైతిని. ఎచటికేఁగి యెట్లు వచ్చితివి?' అని ప్రశ్నించి సుముఖాసత్తిం గాంచి యామె యెవ్వతెయో యెఱుఁగఁగోరెను. ఆమె తన వృత్తాంతమును దెల్పి, మణిస్తంభుఁడును, కలభాషిణియు నొవ్వకుండ మఱల వచ్చుట విచిత్ర'మని పల్కెను. అతఁడును 'నే ననేకవిచిత్రములను గంటిని; వాని నితరులకుఁ దెల్పనిదే మనస్సునకుఁ దృప్తి కల్గదు. పూజ్యురాలవైన నీకుం దెల్పెద' నని యిట్లు చెప్పసాగెను.

"దేవి నన్నట్లు త్రోయఁగా మేమిర్వురమును మణికంధరుఁడు తపస్సు చేయుచున్న వనములో నొక తలిరుఁబొన్నపై పడితిమి. అప్పుడు కలభాషిణి యందము చూడఁగా దుర్బుద్ధిపుట్టి కౌఁగిలించితిని. ఆమె భయమున గట్టిగా నఱచుచుఁ బుణ్యాత్ము లున్న రక్షింపఁగోరినది. అపుడు 'భయము లే'దని చెప్పుచు నలకూబరుఁ డచటికి వచ్చి పారిపోవుచున్న నన్ను పట్టుకొనెను. ఇంతలో రంభయు నచటికి వచ్చి 'చేఁజిక్కినవాఁ డెందు పోఁగలఁడు?' అని

నన్ను విడిపించి 'ఆయువతి యెచ్చట నున్నదియోఁ జూపు'మని యడుగఁగా నేను వారి నా పొదరింటికడకుఁ దీసికొని వచ్చితిని. అచట కలభాషిణి కానరాలేదు. నలకూబరుఁ డచట నున్న నా ఖడ్గమును గ్రహించెను. రంభానలకూబరులు తుదకు నన్ను విడిచి కలభాషిణిని వెదకఁ బోయిరి. అతఁ డెచటనైనను నా కత్తిని విడుచునేమో గ్రహింపవచ్చునని వారి వెనుకనే కొంత దూర మేఁగితిని. వారు కొంతదూర మేఁగి యొక నికుంజమున రతిక్రీడలఁ దేలిరి. అప్పుడు వారికడకు వేఱొకరంభ వచ్చెను. ఇద్దఱు రంభలను జూచి అందఱు నాశ్చర్యపడిరి ఆమెం గాంచి మొదటి రంభ 'ఎవ్వతెయో మాయలాఁడి నా రూపు ధరించి నిన్ను మోసగింప వచ్చినది; కాన నిన్ను నే విడువ'నని యొకచేత నలకూబరుని కంఠమును గట్టిగాఁ గౌఁగిలించుకొనెను. ఇది చూచి రెండవ రంభ ముక్కుపై వ్రేలిడుకొనఁగా నలకూబరుఁడు 'నీ వెవ్వతెవు? నా ప్రేయసి రూపము నెట్లు పొల్పఁగల్గితివి?' అని ప్రశ్నింపఁగా నామె 'నేను రంభను; కాని నేనెవ్వతెను గాను; మాయలాఁడి యొకతె యెట్లో నా రూపము ధరించి నిన్ను మోసగించినది యథార్థమును తెల్పు నుపాయము కనునంత వఱకును మీ రేమన్నను సహింపవలె'నని గుట్టుగాఁ గొన్ని రహస్యవృత్తాంతముల నాతనికిఁ జెప్పెను వానిని విని తొలిరంభ 'ఎట్లు చూచెనో గాని యీ మాయలాఁడి మన వృత్తాంతములను గ్రహించి, చూచినట్లు చెప్పుచున్న' దనెను. మఱియును నిచ్చట నుండిన మోసమగు నని, నలకూబరు నటనుండి తరలింపఁ జూచుచుండ రెండవరంభ తొలిరంభతో 'నీవు నా ప్రియు నప్పగించి, పోఁజాల'నని కలహమునకు సిద్ధపడెను. కొంతసే పిర్వురికి సవతిపో రయ్యెను! అప్పు డిట్టి జగడములను సంతోషించు నారదమహర్షి యచటికి రాఁగా, అందఱు నతనికి నమస్కరించిరి. అంత నతఁడు నలకూబరునితో 'ఈ యిర్వురిలో నీ ప్రియురా లెవ్వతెయో చెప్పినఁగాని యెట్లు దీవింతును? నీ విర్వురికినిఁ గలహము కల్పించితివి. నేను చాలసేపటినుండియు నాకసమునుండి చూచుచునే యున్నా'ననెను. నలకూబరుఁడు 'నేను కయ్యము పెట్ట లే'దనుచు, అతఁడు

తాను రంభతోఁగూడి యుండఁగా నేఁడుకూయు వినవచ్చుటయు, తాను పరుగిడి పోయి ఒకయింతిం బాధించు నొకనిం బట్టుటయు, అచటికిఁ దన కాంత వచ్చుటయు నామెప్రార్థనము ననుసరించి యా క్రూరుని విడుచుటయు, నింతలో రెండవ రంభ వచ్చుటయుఁ దెలిపెను. అంత రెండవ రంభ నారదునితో 'తొల్లి మీరు ద్వారకచేరువ నాడిన మాటలవల్ల నింతలు పుట్టె'నని పలుకఁగా మొదటిరంభయుం నా మాటయే పల్కెను, 'మీమాట యథార్థ'మని నారదు డనెను నలకూబరుఁ డచ్చెరువందుచు 'ఇర్వురిమాటలు యథార్థము లగుట యెట్లని ప్రశ్నించెను. 'రంభగర్వపుమాటలు సహింపలేక నేను 'ముందు నీ కీ రీతిని సవతి కల్గునో యెఱుఁగుదువా?' అంటిని. వేఱొకతె రంభారూపముం త్రిచేఁ బ్రియునిఁ గూడఁగోరఁగా ఆమె కట్టి వరము నొసంగితిని-దానిం బురస్కరించు కొని 'ఆ పలు కింత చేసె'నని యామె యనుటయుం యథార్థమే;' అని నారదుఁ డనెను. నలకూబరుఁ డా యిర్వురిలో నిజరంభను నిర్ణయింపఁగోరఁగా నారదుఁడు 'నీ వొకతెం జూపి ఇంకొకతెగర్వ మడంచుచు నిర్వురితోను సుఖింపుము; తథ్యమిథ్యావిచారము నీ కేల?' అని పల్కి పోయెను.

పిదపఁ దన కాంతతో నలకూబరుఁడు పోఁబోవుచుండ రెండవయామె ఉపాయ మాలోచించి నిజము నిర్ణయింప తొలిరంభను దేవసభకు రాఁగోరెను. అదియే సరియని నలకూబరుఁడును పల్కెను. మొదటిరంభ దాని కంగీకరింపక 'ఇట్టిదానికై యవమానకరముగా దేవసభకుఁ బోవుటయా! నే నిదే ప్రతిన పట్టుచున్నాను. ఏమైనను గానిమ్ము. నేనుమాత్ర మింకమీఁద భూమిని విడిచి దివి కడుగైనఁ బెట్టను' అనెను. ఈ మాటలఁబట్టి యామెకు ఖేచరత్వము లేకుండుట గమనించి రెండవరంభ 'మోసగించి నా నాథునిఁ జేరిన నీవు హేతిఘాతంబున మరణింతువుగాక!' అని తొలిరంభను శపించెను.'

ఇట్లు చెప్పి సిద్ధుఁడు మరల నిట్లనెను:—'మఱియొక విచిత్రము కలదు, వినుఁడు—పిదప రంభానలకూబరు లొక పొదరింటికిఁ బోవుచుండ నలకూబ రాకారుఁ డొకఁడు వచ్చి యచ్చెరువుఁ గల్గించెను. అతనిం జూచి రంభ

‘ఎవరో రక్కసి మాయవేషమున వచ్చె’ నని బెదరిపోఁగా, రెండవ నలకూబరుఁడామెచెంతకు వచ్చి ‘నేనను భ్రాంతితో నీ వింకొకనిం జేరితివి. నలకూబరుఁడను నేనే, నీ వాతనిని విడిచి రమ్మనెను. మఱియుం వానిని విడిచి దూరముగా నేఁగినచో, తన యాయుధమున నా మోసగానిని ఖండించునట్లును పల్కెను. ‘నిరాయుధుఁడగు తన ప్రియు నెవ్వఁడో క్రూరుఁడు చంపుచున్నాఁ’ డని రంభ కేకలిడఁగా రెండవ నలకూబరుఁడు తాను నిరాయుధునితోఁ దలపడ ననియుం, అతఁడు ఆయుధమును తెచ్చుకొని రావచ్చు ననియుం, దేనికిని తాను తొందరపడ ననియుం, పూర్వరహస్యంబు లడిగి, ఉపాయాంతరములచేఁగూడ తథ్యాతథ్యంబుల నెఱుంగవచ్చు ననియుం బల్కెను. అంతదనుక రంభను దూరముగా నుండఁగోరెను. మఱియు తా నామె మణికంధరునితపస్సు భంగమొనర్చి యెంత వేగముగా వచ్చునో యని ఎదురుచూచుచుండఁగా, మోసగాఁడొకఁడు మారువేసమున తన ప్రేయసిని మోసగించినట్లు నారదుఁడు తెల్పె ననియుం జెప్పెను. ‘ఇతనిం బోలువాఁ డితనికిఁ గల్గి కలఁచునేమో!’ అని నారదుఁడు తన్నుఁగూర్చి పలికిన మాట తథ్యమయ్యె ననియుం దలంచెను.

పిదప నలకూబరు లిద్దఱును యుద్ధమునకుఁ దలపడి ఘోరముగాఁ బోర సాగిరి. అప్పుడు రంభ ‘నిలువుఁడు. నే నొక ప్రాక్తనవర్తనము నడుగుదును. ఎవఁడు సరియైన సమాధాన మిచ్చునో అతఁడే యథారనలకూబరుఁ డని నిర్ణయింతును’ అని వారిని వేర్వేరుగా దూరముగా నిలిపి ‘తొల్లి కళాపూర్ణుని ప్రసంగము మన కెచ్చటఁ గల్గెను? ఆ ప్రసంగ మేమి?’ అని ప్రశ్నింపఁగా, దానికి రెండవ నలకూబరుఁడే తగిన సమాధాన మొసఁగినందున అతఁడే యథార్థనలకూబరుఁ డని తేలిపోయెను. అపుడు నలకూబరుఁడు కోపించి, యా మోసగానిని స్వల్పావశిష్టాయుష్కునిఁగా శపించెను. రంభ యా మోసగాని వృత్తాంతమును ప్రశ్నింపఁగా, నలకూబరుఁడు ‘ఇఁక వానితో మన కేమి పని?’ అని యామెం దోడ్కొని పోయెను. మోసగాఁడు మెలమెల్లగ మణికంధరుని యాశ్రమమువైపు విచారముతో నేఁగెను. అపుడు నేను మున్నతఁడు కేళికాని

కుంజాంతరమున నుంచిన నా కత్తిని గైకొని యిటకు వచ్చితిని. దీనిని మా గురువు నా కొసంగినపుడు 'దీని నెవ్వరిని వ్రేయఁ బూనుదువో, యిది తప్పక వారిని వధియించి తీరు' నని చెప్పెను. కావున నెట్లును కలభాషిణి దీనం జావక తప్పదనెను.

కలభాషిణియుఁ 'జరుగున దెట్లును జరుగక మాన' దని ధైర్యముతో నే యుండెను. మణిస్తంభుఁ డామె నామెవృత్తాంతమును చెప్పఁ గోరెను.

## చతుర్థాశ్వాసము

అంత కలభాషిణి నవ్వుచు 'నా వృత్తాంతమంతయుఁ నీవే చెప్పివేసితివి. మాయారంభవేషమున నుండినదానను నేనే! నిన్ను నలకూబరుఁడు వెంటనంటు నపుడు అతనివెంట రంభయుఁ వచ్చెను. కాని ఇంతలో నొకచింక యెదురుగా వచ్చుటచే శంకించి నిలిచిపోయెను. నే నది చూచి నారదుఁ డొసంగిన వరమున రంభరూపముం దాల్చి నలకూబరునివెంతకు బోయితిని. తర్వాతిసంగతి నీకును దెలియును. నారదుఁడు వచ్చియుఁ నాయెడఁ గల కారుణ్యమున నన్నుఁ బ్రకటింపలేదు. పిదప రంభవలన శపింపఁబడి, యా రూపు రోసి, యెట్లును చావు నిశ్చయము కావున పరోపకారమునఁ బ్రాణముఁ బాయఁదలఁచి యిటకు వచ్చితిని. నన్నుఁ జంపి నీ కోరిక నెఱవేర్చుకొనుము. న న్నొక విచారము మాత్రము బాధించుచున్నది. నలకూబరుని పొందితి నని నేను సంతసించుచుండఁగా, అతఁడు వేషధారి యని చెప్పితివి; న న్నిట్లు మోసగించిన కపటాత్ముఁ డెవ్వఁడో యని వంత కల్గుచున్నది' అని విచారముతోఁ బల్కెను:—

అపుడు మణికంధరుఁడు 'ఆ వేషధారిని నేనే' యని తన వృత్తాంతము నిట్లు చెప్పెను:—

'అట్లు నా తపస్సు చెఱుచుటకు వచ్చిన రంభతో వినోదించుచుండియుఁ, ఆమెమనస్సుమాత్రము నలకూబరునిపైనే లగ్నమై యుండుటను తెలిసికొని

కళా——**

గోసి యిటకే నేఁగితిని. నలకూబరునిరూపు ధరించి యామెం గలియఁగోరి నా తపస్సును కొంత ధారపోసి యాతనిరూపు ధరించి, రంభాభ్రాంతితో నిన్నుఁ గలిసితిని. తర్వాతివృత్తాంతము నీకును విదితమే! శప్తుఁడనైనపిదప నా యాశ్రమమునకు వచ్చి మహామహిమాన్విత యగు మృగేంద్రవాహనను సేవింప నిచటికి వచ్చితిని. నీవు నలకూబరునిఁ గోరి నన్ను పొందితివి. నేను రంభను గోరి నిన్ను పొందితిని. నిన్ను పొందుట నాకు సమ్మతమే! నాకుఁ దొలుతనుండియుం నీపై మక్కువ కలదు. కాని నారదుఁడు శపించు నను భయమున నూరకుండవలసివచ్చెను. కాని నేఁటికి నాకోరిక సఫలమైనది.'

మణికంధరుఁ డిట్లు పల్కఁగా కలభాషిణియుం తన కాతనిపైనే ప్రేమ కల దనియు, అతనివలెనే నారదుని శాపభయమున నుపేక్షించితి ననియుం, అతని తోడి పొందికకు సంతసించితి ననియుం, అతనిపోలిక కొంత నలకూబరునియం దుండుటచేతనే —ఎట్లును సాధ్యపడని మణికంధరునిపొందును నలకూబర రూపమునఁ బడయఁగోరితి ననియుం, తన పల్కులు నమ్మఁదగిన వనియుఁ జెప్పెను.

అంత మణికంధరుఁడు నీకు నాపై ప్రేమ కల దనుటకు గుర్తున్నది. నారదమహర్షి నీతో 'నీవు రంభామనోహరాకారుం గూడెద' వని చెప్పెను గాని, 'నలకూబరుం గూడెద' వని చెప్పలేదు. అది యట్లే జరిగెను. మఱియుం నీ మనస్సు నలకూబరుని రూపముననే హత్తియుండుటచే మఱేదియుం నింపుగా నున్నట్లు తోఁచలేదు. ఇట్లుండుట స్త్రీలయెడలనే కాక పురుషులయెడను గాన వచ్చుచుండును. దీనికి దృష్టాంతము తెల్పెదను.

తొల్లి నే ననంతవ్రతోద్యాపనకయి అనంతపద్మనాభక్షేత్రమునకుఁ బోయి అచటి విద్వత్కవు లద్భుతకవితారీతులచే దేవుని స్తుతించుచుండుట కాంచితిని. అట్టి కవిత్వశక్తి కల్గుటకుఁ గారణమును వారివలన నెఱిఁగి, యీ మృగేంద్రవాహనవద్దకు వచ్చి, నాలుక కోసికొని యద్భుతకవితాశక్తిని సంపా

దించి అనంతదేవునికడ కేఁగి, స్తుతించి, యచటి విద్వాంసుల మెప్పు పడసి తిని విద్యాపీఠమగు కాశ్మీరమందలి శారదాపీఠములోని విద్వాంసుల మెప్పు బడసినఁగాని తృప్తిపొందనని యచటి కేఁగితిని. అచట నొక మందిరమున బ్రహ్మవర్చస్సుతోఁ బ్రకాశించు నొక విద్వాంసుఁడు విద్యార్థులకు వేదము చెప్పుచుండుట చూచితిని, అతఁడు నన్ను గని, నా వృత్తాంతము నడిగి తెలిసికొని 'శిష్టానధ్యయన' మని శిష్యులను బంపివేసెను. అప్పు డొక విద్యార్థి యొక పుస్తకము తెచ్చి యియ్యఁగా అంత యాలస్యముగా వచ్చుటకుఁ గారణ మడిగెను. అతఁడు గురువున కిట్లు చెప్పెను.

'మీరు చెప్పినట్లు నేను పూఁదోఁట కేఁగి శాలీనుని గాంచితిని. అతఁడు నన్ను చూచి 'ఓయీ! ఉపాధ్యాయులు పుస్తకమునకయి పంపిరా! సరే! అది యీచెట్టుకొమ్మపై నున్నది. తీసికొందువుగాని లెమ్ము. కొంచెము సేపచటఁ గూర్చుండు' మని యొక మానినీడం గూర్చుండ నియోగించి, ప్రక్కనే యున్న సుగాత్రితో 'నీయౌవనము కొఱవడకుండ దినదినము వృద్ధి పొందుటకుఁ గారణము తెలియఁగుదువా?' అని యామెచెవిలో నేమో చెప్పెను. ఆమె 'జగదంబను నే నొకవరము వేఁడితినే! ఆమె దానికి సమ్మతించెనే! అది యెట్లు సాధ్యపడునో?' అని శాలీనుని చెవిలో నేమో చెప్పెను. అంత నతఁడు మిక్కిలి కోపముతో పరుగిడి పోయి యాచేరువ నున్న శతతాళదఘ్నమను చెఱువులోఁ బడెను. సుగాత్రియు నాతనిననుసరించెను. అచటివారు వెంటనే వలలు వేసి వెదకిరి; గాని లాభము లేకపోయెను. పిదప నే నా చెట్టుకొమ్మ మీఁది పుస్తకము తెచ్చితిని. నా యాలస్యమునకు కారణ మిది' అని. గురువది విని 'అయ్యో! ఆ యుత్తమదంపతుల కెట్టిగతి సంభవించినది!' అని విచారించెను. 'వారివృత్తాంతమును నిప్పవలె' నని నేను కోరఁగా 'ఆ వృత్తాంత మీ పుస్తకమునందే యున్న' దని దానిని కన్నుల కద్దుకొని శిష్యునిచేతి కిచ్చి చదువఁగోరెను. శిష్యుఁ డిట్లు చదువసాగెను:—

'కాశ్మీరమునందలి శారదాపీఠములో సరస్వతీదేవిని పూజించు నొక పూజారికి దేవియనుగ్రహమున సుగాత్రి యను పుత్రిక కలదు. ఆమెభర్త శాలీనుఁడు; ఇల్లరికపుటల్లుఁడు. ప్రథమసంగమసమయమున సుగాత్రిని బాగుగ నలంకరించి భర్తకడ కంపఁగా, ఆ యలంకారములఁజూచి భర్త తలఁకి యామెం జేర సంకోచింపసాగెను. ఇట్లు దినములు గడచుచుండెను. మనుమఁడు కలిగి, వంశమును నిల్పు నని కుతూహలపడు సుగాత్రి తల్లి కల్లుని ప్రవర్తన కంటక మయ్యెను. ఆమె యాతనిని పూఁదోఁటపని చూడ నియోగించెను. శాలీనుండు సదా తోఁటలో నుండి మిగుల శ్రద్ధాభక్తులతో తన కృత్యమును నెఱవేర్చుచుండెను. తన తల్లి యాతని నేమియుఁ బరుషోక్తు లాడకుండ సుగాత్రి చూచుచు, భర్త శ్రమపడుటకు మిగుల విచారించుచుండెను.

ఒకనాఁడు శాలీనుఁడు పూఁదోఁటలో నుండఁగా విపరీతముగా వర్షము కురిసెను. 'ఆవర్షమువలన తనభర్త కెట్టిశ్రమయుఁ కల్గకుండునట్లు చేయవలె' నని సుగాత్రి సరస్వతీదేవిని ప్రార్థించెను. పిదప నెవ్వరికిని దెలియకుండ తా నచటి కేఁగి అతఁడు చెక్కుచెదరకుండ నుండుట చూచి, దేవియనుగ్రహము నకు సంతసించి యింటికి వచ్చెను. ఇట్లు కొన్నిదినములు జరుగఁగా సుగాత్రి తోఁటకు వచ్చి భర్తకుఁ బనిపాటులలో సాయపడసాగెను. ఆ సమయమున నామె తన నగల నన్నింటిని తీసివైచి యొకచో నుంచినపు డామె సహజ సౌందర్యముచే నాకర్షింపఁబడి శాలీనుఁ డామెను రతులఁ దేల్చెను. కాని యామె రాత్రి నగలు ధరించివచ్చినపుడు ప్రేమ చూపకుండెను. సుగాత్రి తన భర్తకు సహజసౌందర్యమే ప్రీతిదాయక మని గ్రహించి యాతనియిష్టము ననుసరించియే ప్రవర్తించుచుండెను. తల్లి యామెను మందలించి చూచెం గాని, యామెప్రవర్తనలో తప్పులు దిద్దవద్దని సరస్వతీదేవి ప్రత్యక్షమై తెలుపుటచే నూరకుండెను.'' పిదప ఆగురు వి ట్లనెను—

'ఒకనాఁ డామె నాకు స్వప్నమున నగపడి నిత్యమును ప్రాతఃకాలమునఁ జదువుమని యీ పుస్తకమును నా కొసంగెను. ఆమె యీవిధముగా నూరిలో'ని

యందఱికి నిచ్చినదఁట! నేను నిన్న ఆ దంపతులం జూడ నేఁగి యీ పుస్త కము నచట మఱచి వచ్చితిని. నేఁటి యుదయమున దీనికై శిష్యునిఁ బంపఁగా నీ ఘోరవార్త వినవచ్చినది.'

మణికంధరుఁ డిట్లు చెప్పి 'ఆ విధముననే నీ మనస్సున ఒక రూపము హత్తుకొని యున్నందున ఇతరము గోచరము కాలేదు. ఇది సహజము' అని సుముఖాసత్తింజూచి 'అమ్మా! నీవును శారదాపీఠనివాసినివే గదా! నీకీవృత్తాంతము తెలియదా?' అని ప్రశ్నింపఁగా ఆమె 'ఆ సుగాత్రిని నేనే' అని తన వృత్తాంతము నిట్లు చెప్పెను.

'నే నట్లు మగనివెంటఁ బోయి శతతాళదఘ్నమునఁ బడఁగా ఒక మొసలి నన్ను మ్రింగి అరిగించుకొనలేక మఱునాఁడు నన్నొడ్డునఁ గ్రక్కినది. సరస్వతీ కటాక్షమున నే జీవించితిని. కాని భర్తసంగతి తెలియనందున వైరాగ్యముఁ బూని విద్వద్వర్యుల నాశ్రయించి యోగాదివిద్యల నభ్యసించితిని. సదా సుముఖుల (విద్వాంసుల) సమీపవర్తన కల్గుటకతన నాకు సుముఖాసత్తి యను ప్రసిద్ధి కల్గినది. పిదప తీర్థయాత్ర లొనర్చుచు, నీ దేవిమహిమ వినియుంచుటకై వచ్చితిని. తర్వాతి నా వృత్తాంతము మీకుఁ దెలిసినదే!' అనెను.

అంత మణిస్తంభుఁడు సుముఖాసక్తితో 'ఆ శాలీనుఁడను నేనే! అట్లు మడుగులోఁ బడి—దానియడుగున జలస్తంభన చేసి, యింటిలో వలె నున్న యొక సిద్ధునివద్ద చేరితిని. అతఁడు నా వృత్తాంతమంతయు విని, హితము గఱపి వయస్సును స్తంభింపఁజేయు నొక మణిని, కత్తిని, తా నెక్కు సింహ వాహనమును, దానిని వశమొనర్చుకొను జ్ఞానము నొసఁగి పంపివేసెను. ఆ కత్తిచే నెవ్వరిం జంపఁదలంతునో, వారి నది తప్పక చంపఁగలదు. మణివలన వయస్సును స్తంభింపఁజేయుటచే నాకు మణిస్తంభుఁడను ప్రసిద్ధి కల్గెను.' అనెను.

అతఁ డిట్లు చెప్పఁగా అందలి సత్యాసత్యముల నరయఁగోరి శాలీనుఁడు తన చెవిలో నేమి చెప్పెనో, అతనికిఁ గోపము కల్గుటకుఁ దా నతని

చెవిలో నేమి చెప్పెనో తెలుపవలె నని సుముఖాసత్తి కోరెను. ఆమెకోరిక చొప్పున మణిస్తంభుఁడు తొలుత మణికంధరున కా వృత్తాంతమును రహస్యముగాఁ దెల్పెను. తర్వాత సుముఖాసత్తివలన నా వృత్తాంతముఁ దెలిసికొని, అతఁడు శాలీనుఁడే యని నిశ్చయించెను. ఆ విషయ మేమన—'నా యంగమున నీకు నందనుఁడు కలుగు' నని సరస్వతి వర మిచ్చె నని సుగాత్రి శాలీనునితో పల్కెను. ఆమెకు గర్భము కలుగకుండునట్లు శాలీనుఁడును వరముఁ బడసెను.

పిదప సుముఖాసత్తి తనభర్తం గని సంతసించి, ఉత్తముఁడగు మణికంధరునకు శాపము కల్గుటకు విచారించెను—అప్పుడు కలభాషిణి 'కళాపూర్ణుని వృత్తాంతము నీవు విన్నదేకదా! దాని నేల చెప్పి తప్పించుకొనవైతివి?' అని ప్రశ్నింపఁగా మణికంధరుఁడు 'ఆ వృత్తాంతము తనకుఁ దెలియ ద'నెను. అంత నామె 'ఔనది నిజమే! నారదముని నా కయ్యది చెప్పునపుడు నీవు కొంత దూరముగా నుంటివి.' అని నారదుఁ డా వృత్తాంతమునుగూర్చి పల్కిన దంతయుం బూసగ్రుచ్చినట్లు చెప్పెను.

ఆమె యిట్లు చెప్పు సమయమున అచటికి వచ్చిన అలఘువ్రతుఁ డను మళయాళబ్రాహ్మణుఁ డా వృత్తాంతమును విని సమస్తభోగభాగ్యములను, దీర్ఘాయువును, పుత్రపౌత్రాభివృద్ధిని గల్గించు నా కళాపూర్ణుని కథను దెలియఁగోరి మృగేంద్రవాహనయొద్ద జపము గావింపసాగెను.

పిదపఁ గలభాషిణి తన్ను సంహరింపవలె నని మణిస్తంభునిఁ గోరఁగా సుముఖాసత్తి దేవిపైఁ బెట్టుకొనిన యొట్టు ననుసరించి తా నట్లు చేయ సాహసింపక అక్కార్యమునకు మణికంధరుని నియోగించెను. కలభాషిణీ సుముఖాసత్తు లదియే మే లనిరి. దయాళువగు మణికంధరుఁడు బలివిధానమునఁ గొంత జాల మొనరించుటచే దేవి 'నీవు బలివిధానమున నాలసించుటచే నీ కీ జన్మమునఁగాక మరుజన్మమున రాజ్యప్రాప్తి యగును. పుట్టుకతోడనే నీవు యువ

కూడ వగుదువు., కలభాషిణియు వెంటనే బ్రతికి ద్వారకలోఁ దనయింట నుండఁ గలదు' అని పల్కెను. కలభాషిణి వెంటనే జీవించి, కన్నులు తెఱచిచూడఁగా ద్వారకలో తనయింట నుండెను. మణికంధరుఁడు నలకూబరుని శాప మనుభ వింప భృగుపాతమునకై శ్రీశైలమున కేఁగెను. అతఁడు పోవునపుడు తన వీణెను మృగేంద్రవాహనగుడిలో నొక రహస్యస్థలమున భద్రపఱచి, తన రత్నమాలిక నలఘువ్రతున కిచ్చివేసెను.

మణిస్తంభసుముఖాసత్తులు మృగేంద్రవాహనము నెక్కి వివిధస్థలముల కేఁగి వింతల నరయుచు వినోదించుచుండిరి.

## పంచమాశ్వాసము

అలఘువ్రతుఁడు రెండేండ్లపాటు తపస్సు చేయఁగా దేవి ప్రత్యక్షమై 'నీ కోరిక వేఱొకచోట సిద్ధించు' నని పల్కెను. వెంటనే వెనుదాలి వీవఁగా, నతఁ డెగిరి ఒక రాజు కొలువుతీర్చియుండఁగా నా సభామధ్యమునఁ బడెను. ఇతఁడు కన్నులు తెఱచి చూడఁగా ఇంద్రవైభవమున నున్న ఒకరాజు సింహా సనాసీనుం డగుటయు, నతనియెదుట బంగరుతొట్టెలో నొక పసిబాల యుండుటయుఁ గానవచ్చెను. ఇతని రాక కచ్చెరు వందిరి. అలఘువ్రతుఁడు తన రత్నహారమును రాజునకుఁ గానుక యీయఁగా నతఁడు అలఘువ్రతుని కులనామములు మాత్ర మడిగి తెలిసికొని విశ్రాంతిఁ దీసికొనఁ గూర్చుండ నియ మించి, ఆ మణిహారము నా శిశువునకుఁ బెట్టించెను. వెంటనే యా శిశువు నవ్వి 'మఱల రెండేండ్ల కీ హారమును జూడఁగల్గితి' ననెను. ఆ మాటల కందఱు నాశ్చర్యపడిరి. రాజు 'బాలా! నీవు పుట్టి యింకను రెండు నెల లయ్యెనో లేదో! రెండేండ్లక్రిందట దీనిం జూచుట యెట్లు తటస్థించెను?' అని ప్రశ్నింపఁగా— దీనిని నా వెనుక జన్మమునఁ జూచితిని' అనెను. పిదప రాజు కోరఁగా ఆ శిశువు తన వృత్తాంతము నిట్లు చెప్పఁదొడంగెను.

'నేను క్రిందటి జన్మమునఁ గాక, అంతకు వెనుకటిజన్మమున సరస్వతీ దేవియొద్ద నుండిన పెంపుడుచిలుకను. ఒక శాపమువలన రెండవ జన్మ కలిగినది. ఆ శాపమునకుఁ గారణము కలదు.

ఒకప్పుడు బ్రహ్మయుఁ, సరస్వతియును గృహారామమున విహరింప నేఁగిరి. అచటఁ గల యొక సరస్సునకుఁ దూర్పుగట్టునఁగల కల్పవృక్షపు నీడలోఁ దలిరుఁబాన్పున, సరస్వతీదేవి పాదములొత్తుచుండఁగా, ఆ సరోవర మున కభిముఖముగా బ్రహ్మ పవ్వళించి యుండెను. అపుడు దేవి వల దని యధ రమునకుఁ జేతి నడ్డముగా నుంచుచున్నను బలిమిని దంతక్షత మొనర్చెను. అప్పు డామెకంఠసీమలో నొక్క మధురశబ్దము ఉదయించెను. ఆమె కొంచెము కోప ముతో మొగము నటు త్రిప్పెను. బ్రహ్మ యపుడు తద్విరహదశా వికల ధైర్యుఁడయ్యెను, లేని ధైర్యము నటించి ఎదుటి చెట్టుకొమ్మకు వ్రేలఁగట్టఁబడిన పంజరమున నున్న నన్నుఁ జూచి ఉబుసుపోక కేదేని కథఁ జెప్పఁగోరెను. 'మీయెదుట నేఁ గథలు చెప్పుపాటిదాననా?' అని నేను పల్కఁగా 'నేనే చెప్పెదను; నీవు విను' మని యిట్లు చెప్పెను.

'కాసారపురమున కళాపూర్ణుఁ డను రాజు కలఁడు. అతఁడు పుట్టినతో డనే యువకుఁడై స్వభావసిద్ధుఁ డొసఁగిన యరుణ మణిని, విల్లమ్ములను గ్రహిం చెను. ఆ కళాపూర్ణుఁడు పుట్టినతోడనే యువకుఁడై రాజుల నందఱిని జయిం చెను. ఒకపుడు మదాశయుఁడను రాజు రూపానుభూతి యను భార్యతోను, ధీరభావుఁడను మంత్రితోను వచ్చి యెదిరింపఁగాఁ కళాపూర్ణుఁడు తన కోదండ విహారమున ధీరభావుని దూరముగాఁ దఱిమి, శరణుచొచ్చిన ఆ రాజు భార్య తోఁగూడ తనకు సేవలొనర్ప నియమించెను. కళాపూర్ణుని కాంత యభినవ కౌముది. తండ్రి సుముఖాసత్తి; తల్లి మణిస్తంభుఁడు.'

బ్రహ్మ యిట్లు పల్కఁగా సరస్వతి కోపముపోయి నవ్వుచు 'ఏమీ? ఆరాజుతల్లి మగవాఁడు; తండ్రి యాఁడుదియునా?' అని ప్రశ్నించి తర్వాత

కథయుం జెప్పుకొనెను. బ్రహ్మ యామె ప్రసన్నభావమును గ్రహించి యామె కంఠమును గౌఁగిలించి తననాల్గుమోములనామె యధరమును చుంబించెను. 'తర్వాతికథ యే'మని సరస్వతి మఱి మఱి ప్రశ్నింపఁగా, 'ఏమున్నది ? సత్యదాత్తుఁడను నాతనిమంత్రి అంగదేశమందలి క్రముకకంఠోత్తరమను నగరమునఁ దన్ను పట్టముకట్టి నిల్పఁగా సుఖముగ సామ్రాజ్యసుఖము లనుభవించుచుండెను. మదాశయుం డతనిపురికి బంగరుకోట పెట్టించి, భార్యతోఁగూడ నాతనిని సేవించుచుండెను. ఆ కళాపూర్ణునిదగ్గఱి మణిని గాంచిన కతమున మదాశయ రూపానుభూతులకు 'మధురలాలస' యను తనయ కలిగెను.

మదాశయునికడ నల్వురు పురోహితులు ప్రథమాగముఁడు, ద్వితీయాగముఁడు, తృతీయాగముఁడు, తురీయాగముఁడు అనువారు కలరు. వారు తమ ప్రభువు ధరించు మణిని పర్యాయముగాఁ బట్టి తత్సంస్పర్శచే ఆనందమగ్ను లగుచుండిరి. వారందరును దస్నాశ్రయించి యుండుటచే వారి చేష్టలకుఁ కళాపూర్ణుఁడు సమ్మతించి యుండెను. వారిలో నొకఁడా మణిని గట్టిగా నొక్కి పట్టఁగా కళాపూర్ణుఁడు కోపగించుకొని వారిని పాయఁద్రోలి, వారి స్వామియగు మదాశయుని బంగారు ప్రాకారము నొల్లక దానిని విఘటితము గావించెను. అతఁడును 'ఏమైనను తనవాఁడనే గదా ! తనదేశములోనే ఎంతైనను బ్రతికెద'నని కుటుంబసహితముగాఁ గ్రముకకంఠోత్తరపురంబు వెల్వడి చనుచు పూర్ణకలశద్వయమును గాంచి మురియుచు, మధ్యదేశమునఁ జాలకాలముండెను. క్రముకకంఠోత్తరపురమునుండి వెడలి వచ్చునపుడు ప్రయాణక్షోభమున వారిపుత్రిక యగు మధురలాలస కృశించి ఎప్పటికిని తేఱుకొననందున మదాశయుఁడు తిరిగి సకుటుంబముగ క్రముకకంఠోత్తరపురమునకు వచ్చెను. కళాపూర్ణుని దర్శనమున మధురలాలస కృశత్వమును విడిచి బలిసెను. తలిదండ్రులు మధురలాలసస్థితిని కళాపూర్ణునకుఁ దెలిపి, అతనిం బొగడి ప్రసన్ను నొనర్చుకొనిరి. ప్రథమాగమాదులగు పురోహితులును వినయవిధేయతలతో మెలంగిరి. మధురలాలస కొంతకాలమునకు యువతియై కళాపూర్ణుని వరించెను."

బ్రహ్మ యిట్లు చెప్పఁగా సరస్వతి కొంత రోషముతో ‘చాలు లెండు; మీ చమత్కారములు! ఇపుడు జరిగినదానినే మీరు కథగాఁ గల్పించి చెప్పి నారు. ఈమాత్రము నాకు తెలియకపోదు. కొలను, కాసారపురమని యంటిరి. అందు ప్రతిఫలించు నా ముఖమును కళాపూర్ణుఁ డంటిరి. ఆ ముఖచంద్రుఁడు తక్కిన ముఖచంద్రుల నతిక్రమించి యున్నాఁ డనుటకు ‘ఆ రాజు తక్కిన రాజుల నందఱిని జయించె’ నంటిరి. మఱియు నతఁడు స్వభావుఁడను సిద్ధుని చేత ధనుర్బాణములను, అరుణమణిని పొందె ననుట భ్రూలతా, వీక్షములును, అధరమును స్వభావసిద్ధముగఁ గలిగె నని చెప్పుటయేగదా! మదాశయుఁడు రూపానుభూతితోను, ధీరభావువితోను రాఁగా, ధనుర్విలాసమున ధీరభావునిఁ దఱిమి మదాశయరూపానుభూతులచే సేవలు గైకొనుట-ఆ కాసారమునకయి మీహృదయము, దృష్టియును ధైర్యముతోఁగూడ నొక్కించుక ప్రవర్తిం పఁగా - నా ముఖప్రతిబింబము భ్రూవిలాసముచే మీ ధైర్యముఁ బోఁగొట్టి, మీ హృదయమును, దృష్టిని ఆకర్షించె నని చెప్పుటయేగదా! ఈ మాటలకు నాకు నవ్వు రాఁగా, నా ప్రతిబింబమునఁ దోఁచిన యా నవ్వును జూచి శ్వేతవెన్నెలతో అభేదమును కల్పించి ‘అభినవకౌముది’ అని పేరిడి, స్త్రీగా నూహించి, దానిని కళాపూర్ణుఁడు వరించె నని చెప్పితిరికదా! ఆ కళాపూర్ణు నకు సుముఖాసత్తి తండ్రియు, మణిస్తంభుఁడు తల్లియు నని తార్మారుగ ననుట ఆ ప్రతిబింబము శోభనమగు ముఖసామీప్యము కారణముగా ఆ చెఱువు నడుమఁ గల మణిస్తంభముగర్భమున నుదయించె నని చెప్పుటయే గదా! నేను మీ మాటలకు నవ్వును, వేడుకను పట్టలేక మీ కభిముఖముగాఁ దిరుగఁగా కాసారమునడుమ ప్రతిబింబము పోయి, నా ముఖము మీ కెదుటఁ గాన్పిం పఁగా - అది నా దేహమున కంతము మీఁదిభాగమునఁ గన్పట్టుటచేతనే గదా- ఆ కళాపూర్ణుఁ డంగదేశమున క్రముకకంఠోత్తరపురమునఁ బట్టముకట్టుకొనె నంటిరి! అది మదీయాత్మాధీనమగుటచేఁగదా సత్త్వదాత్ముఁడు పట్టముగట్టె నని చెప్పుట? సత్త్వదాత్మపదమునకు ‘సమీచీనత్వదాత్ముఁ డనియే కదా అర్థము?

పిదప మీరు నా కంఠమును కౌఁగిలించుటయు, అది మీ యాత్మాధీన మగుటయు, మీ బాహువులు సువర్ణవర్ణము లగుటయుఁ దెలుపఁదలంచియే కదా మీరు మదాశయుఁడు క్రముకకంఠోత్తరపురమునకు బసిఁడికోట పెట్టించె నంటిరి! మీ మనోదృష్టులు పాయక నా ముఖముపై వర్తిల్లి, మధురాధరేచ్ఛ కల్గియుండుట చూచి, మదాశయ, రూపానుభూతులు కళాపూర్ణుని సేవించుచు, తన్మణిమహత్త్వమున మధురలాలస యను తనయను గాంచి రని యంటిరి. ఆ మణిమహిమను మెచ్చుచు, ప్రథమాగమాదు లగు మదాశయుని పురోహితులు ఆమణినిబట్టి చూచుచు, తత్సంస్పర్శనమున నానందమగ్నులైరనుట - చుంబనేచ్ఛానంతరము మీ ముఖములు నాల్గును నా యధరపానమున నింపొందె ననుటయేగదా! ఆ ముఖములు ఋగాద్యాగమముల పుట్టుకకుఁ గారణములే కదా! అంతట అధరపీడ జనింపఁగా నేను కోపించి, వానిని వారించి, కౌఁగిలి విడిపించుకొనిన నది కళాపూర్ణుఁడు తన మణి వారియుం దొక్కనిచే పీడింపఁబడఁగా కోపించి, వారిం బాయఁ దోలించె ననియుం, మదాశయుని బంగారు ప్రాకారము విఘటితముచేసె ననియుఁ బల్కితిరి కదా! అంత మీ మనోదృష్టులు నా యితరావయవములవంక పోఁగా - మదాశయుఁడు భార్యతో కళాపూర్ణుని సేవ చాలించి తదాశ్రయమగు అంగదేశమునకుఁ బోయె ననుచు, పూర్ణకలశవ్యాజమున వక్షోజములను, మధ్యదేశవ్యాజమున నెన్నడుమును వర్ణించితిరి కదా! ముఖమును విడుచుటచే నధరేచ్ఛ యడఁగఁగా ప్రయాణశోభవలన మధురలాలస కృశించిన దంటిరి. పిదప మీ మనోదృష్టులు నా ముఖమువంక తిరిగి చుంబనేచ్ఛ పరితుష్టిఁ బొంది, కోరిక సఫలము కాఁగా మదాశయుఁడు కుటుంబసహితముగా తిరిగి కళాపూర్ణుని సేవకు వచ్చె ననియు, మధురలాలస కృశత్వము విడిచి, పెరిఁగి యౌవనంబునఁ గళాపూర్ణునియనుగ్రహమును బొందె ననియుఁ జెప్పితిరి. ఈ నా యూహ సరియగునో, కాదో తెల్పఁగోరెద.'

సరస్వతీదేవి యిట్లనఁగా బ్రహ్మయు నామెయూహ సరియైనదే యని [illegible]ంచెను.

నేను పక్షి ననియో, మరే కారణముననో నన్ను లెక్కింపక నా యెదుటనే వా రిట్లు ప్రసంగించుకొనిరి.

ఒకప్పుడు నే నీ ప్రసంగము మననము చేసికొనుచుండఁగా బ్రహ్మను సేవింప నింద్రుఁడు రాఁగా - అతనివెంట నున్న రంభ యీ ప్రసంగమును విని 'ఇది చాల సొంపుగా నున్నది అయ్యవారిని సేవించునెడల అమ్మవా రిట్లు పల్కరా యేమి?' అని ప్రశ్నించెను. ఇయ్యది రహస్యవృత్తాంతమను సంగతి నెఱుంగక నేను రంభయెదుట నీ వృత్తాంతమును జెప్పితిని. ఆమె నాచే దీనిని రెండు మూఁడుమార్లు చెప్పించుకొనెను. అపుడు సరస్వతీదేవి తొందరగా వచ్చి కోపముతో నన్నుఁ జూచి 'భూలోకమున వేశ్యవై పుట్టుదువుగాక!' అని శపించెను. ఆమెకోపమునకు జడిసి రంభ యొక్క రత్నస్తంభపుఁజాటున నొదిగి నిలిచెను. ఇంతలో బ్రహ్మ వచ్చి సంగతి తెలిసికొని వాణి యొసంగిన శాపమునకు విచారించి నన్నుఁ జూచి 'మీ యమ్మ యొసఁగిన శాపమునకు విచారింపకుము. నీవు శాపవశమున వేశ్యవై పుట్టినను మరుజన్మమున మదాళయుండను రాజునకు మధురలాలస యను పుత్రికవై జనించి కళాపూర్ణుఁడను రాజునకు భార్యవై యనన్యభోగభాగ్యము లనుభవింపఁగలవు' అని పలికెను. 'ఇది యేమి? వెనుకటి సంగతినే మఱల ప్రారంభించుచున్నారే?' అని సరస్వతి యడుగఁగా బ్రహ్మ 'ఇట్లు జరిగియే తీరు' ననెను. 'అయినచో తల్లి మగవాఁడును, తండ్రి ఆఁడుదియుం గూడ అగునా?' అని సరస్వతి ప్రశ్నింపగా 'అట్లే జరుగు' ననెను. అంత సరస్వతి 'ఏమయినఁ గానిండు. ఈ విధముగ మన వృత్తాంతమును లోకమునఁ జాటుట మేలుకా' దనఁగా 'ఇది యెట్లును వెల్లడి కాఁగల' దని బ్రహ్మ యనెను. సరస్వతీదేవి రంభను బిలిచి 'ఈసంగతి యెచటనైనను బయలుపెట్టెదవేమో! జాగ్రత!' అని శాసించి, తాను బయలుపఱుప నని బ్రహ్మవలనను మాట పుచ్చుకొని 'ఇంక నెట్లు వెల్లడి యగునో చూత'మనెను. ఇయ్యది వసుధ వెలయ మార్గము కల్గుననియుం, దీనిం జెప్పినట్టివారును, వినినట్టి

వారును భూమిపై పుత్రపౌత్రాభివృద్ధి నొందుచు సంపదభివృద్ధితోఁ జాల కాలము శుభసౌఖ్యములు కాంతురని మదీయాశీర్వాద' మని బ్రహ్మ పలికెను.

సరస్వతీశాపము ననుసరించి నేను ద్వారకలోఁ గడచిన జన్మమున కాలభాషిణి యను వేశ్యనై జనించితిని" అని యా జన్మమునందలి వృత్తాంత మంతయుం నా బాల వినిపించి యిట్లనెను.

బ్రహ్మయనుగ్రహమున నీ జన్మము కలిగినది. కడచిన జన్మమున శక్తి గుడిలోన నీ వారమును చూచు భాగ్యము లభించినందున రెండేండ్లకుఁబిదప మఱల దీనిం జూడఁగల్గితి' నంటిని.

అంత నలఘువ్రతుఁడు 'అమ్మా! క్రిందటి జన్మమున కలభాషిణివిగా నున్నపుడు కళాపూర్ణుని వృత్తాంతమునుగూర్చి చెప్పిన సంగతి నాకుఁ దార్కాణమైన'? దని పల్కి ఆ బాలిక మధురలాలస యైన విధమును, ఆమె భర్త యగు కళాపూర్ణు డెప్పుడు చూచు నదృష్ట మబ్బునో - ఆ సంగతియుం దెలుపఁగోరెను. ఆ బాల 'నేను చెప్పుటకంటె వీరలు తెల్పుటయే మే' లనఁగా అతఁ డా మహారాజునే ప్రశ్నించెను. ఆ రాజు తానే కళాపూర్ణుఁడ ననుచు, బ్రహ్మసరస్వతుల వృత్తాంతము ననుసరించియే తన చరిత్రమంతయుం నున్న దనెను. అలఘువ్రతుఁడు 'అట్లయిన మీకుఁ దల్లి మగవాఁడు, తండ్రి యాఁడుదియుంనా?' అని ప్రశ్నింపఁగా అవృత్తాంతము నా బాలికనే యడుగ వలె నని రాజు కోరెను. ఆ బ్రాహ్మణుఁ డా విషయమును ప్రశ్నింపఁగా ఆమె మణిస్తంభ, సుముఖాసత్తుల వృత్తాంతమును తొలుత చెప్పి యిట్లనెను.

'ఒకప్పుడు మణిస్తంభుఁడు విపరీతరతీచ్ఛతో భార్యం గాంచి 'నేను నారీత్వము భజింతును; నీవు పురుషుండవు కమ్ము' అని పలుకఁగా నామెయుం ఆ మాటలే పలికెను. వెంటనే వారి యవయవములలో మార్పు కల్గి సుముఖా సత్తి పురుషుఁడును, మణిస్తంభుఁడు స్త్రీయుం నైరి. అట్టి మార్పునకు వారిరు వురికిని ఆశ్చర్యము కలిగెను. సుముఖాసత్తి కొంతతడ వాలోచించి 'మృగేంద్ర

వాహన తన్ను సత్యవచనగా నొనర్చిన వరమువలననే ఇట్లేర్పడెనని తెలిసికొని భర్తకుఁ దెల్పఁగా, అతఁడు 'సరియే! సరస్వతీదేవి నీకు గర్భము కల్గకుండునట్లు నాకు వరమిచ్చెను; నీకూటమిని నాకుఁ గొడుకు కల్గునట్లు నీవు వరమొసఁగెను. అవి యీ రీతిని ఫలించునో, యేమో! కొంతకాలము మన మిట్లే యుందము' అనెను. పిదప సుముఖాసత్తి మణిస్తంభుఁడుగాను, మణిస్తంభుఁడు సుముఖాసత్తిగాను వ్యవహరించుచు, తమ మృగేంద్రవాహమున దేశములఁ దిరుగుచుండి, యొకప్పుడు సత్వదాత్ముఁడను రాజు పాలించు కాసారపురప్రాంతమున వాహనము దిగిరి. ఆ సమయమున వేఁటకుఁ బోయి మఱలి వచ్చుచున్న సత్వదాత్ముఁడు వీరిం గాంచి, అందు యువతిపై మనస్సు పోఁగా, ఎట్లయిన నామె తన గృహమున నిలుపఁదలఁచి సిద్ధుని 'మీ దంపతులు మాయింటఁ గొంతకాల ముండి యాతిథ్యమును గ్రహింపవలె' నని ప్రార్థించెను. సిద్ధుఁడందులకు సమ్మతించెను. ఇట్లు కొంతకాలము గడవఁగా సత్వదాత్ముఁడు తగినవారిం బంపి సుముఖాసత్తి తనవద్దకు వచ్చున ట్లడిగించెను. ఆమె యప్పటికే గర్భవతియై యున్నందున పుత్రోత్పత్తి యగువఱకు అన్యునిఁ గలయ' నని చెప్పి పంపివేసెను. నెలలు నిండఁగా కృత్రిమ సుముఖాసత్తికి ఈ మహారాజు-కళాపూర్ణుఁడు కలిగెను. బ్రహ్మదేవుఁ డితని తలిదండ్రుల కాగంతుకములైన వర్తమాన నామధేయములు చూడక సహజనామముల నవలంబించి, యీ రీతిగా నితనికి మణిస్తంభుఁడు తల్లి యనియు, 'సుముఖాసత్తి తండ్రి యనియుఁ బలికెను.

పుత్రజననానంతరము ఆ దంపతులు తొంటియట్ల రూపములు మార్చుకొని, సహజనామములతోఁ గాసారపురమునందే యున్నారు. ఈరాజు పుట్టిన తోడనే యువకుఁడై వెలసెను. గొప్ప సుశకునములు కలిగెను. ఈ యద్భుతములను గాంచి, యతఁ డొక మహాపురుషుఁ డని తెలిసికొని సత్వదాత్ముఁడు తన దురభిప్రాయమును క్షమింపవలె నని సుముఖాసత్తిని ప్రార్థించెను. మఱియు తన

రాజ్యమును కళాపూర్ణున కర్పించి, తా నతనికి మంత్రిగా నుండెను. స్వభావు-డను సిద్ధుఁ డితనికి మణిని, శరచాపములను సమర్పించెను.'

అంత నలఘువ్రతుఁ డా బాలికం జూచి స్వభావసిద్ధుని వృత్తాంత మడుగఁగా ఆ బాలిక యిట్లు చెప్పెను:—

'స్వభావసిద్ధుఁడు సుగాత్రి తండ్రి. ఆమె జనించినపిదప నాతఁ డిల్లు విడిచి, దేశములు తిరిగి మాహురీనగరమున దత్తాత్రేయునిం గూర్చి ఘోరమైన తపస్సుచేసి, తదనుగ్రహమున అనేకయోగరహస్యములం దెలిసికొని, తిరిగి జన్మస్థలమునకే వచ్చి శతతాళదఘ్నహ్రదమున జలస్తంభనచే రహస్యముగ నుండెను. శాలీనుఁడు భార్యపైఁ గోపించి, ఆ చెఱువులోఁబడి తనకడకు రాఁగా—అతని వృత్తాంత మడిగి, తెలిసికొని, తన బంధుత్వమును బ్రకటింపకయే వయఃస్తంభన మణి మున్నగువాని నొసంగి పంపివేసెను. పిదప యోగనిష్ఠను విడిచి, శ్రీశైలమునకుఁ బోఁగా, భృగుపాతంబున ప్రాణత్యాగ మొనర్చుటకు సంసిద్ధుఁడై యున్న మణికంధరుని గాంచుట తటస్థించెను. అతని వృత్తాంత మంతయుం దెలిసికొని, మరుజన్మమున ఎట్టును సమస్తశుభములు నిశ్చితములై యుండఁగా ఆత్మహత్యకుఁ గారణము నరయఁగోరెను. మణికంధరుఁడు తా నుత్తమదంపతులకుఁ బుత్రుఁడుగా జనింపఁగోరియే అట్లొనర్చుచున్నా నని చెప్పెను. అంత స్వభావుఁడు 'నీ కోరిక అదియే యైనచో శాలీనసుగాత్రు లుత్తమదంపతులైనందున వారికే పుత్రుఁడవై పుట్టునట్లు కోరుకొనుము. దీనివలన నీకు మేలు కలుగును. నే నొకప్పు డాత్మరక్షణార్థము ఖడ్గమును కోరఁగా దత్తాత్రేయుం డసాధారణమగు కత్తి నొసంగుచు 'ఇఁకమీఁద నీ వంశము క్షత్త్రియవంశము కాఁగలదు.' అని చెప్పెను. య్యది నీవు నా యల్లునకుఁ బుత్రుఁడవై పుట్టుటకే అనుకూలమై యున్నది' అని చెప్పెను. అంత మణికంధరుఁడు 'నేను రాజుగా జన్మించినచో బహిశ్శత్రువులను, అంతశ్శత్రువులను జయింపనిచే ప్రయోజనము లేదు. ఇదియే నా విచారము. అది పోవు మార్గము చూప

వలయు' నని ప్రార్థింపఁగా—స్వభావుఁడు 'దత్తాత్రేయునికృపవలన బహిశ్శత్రువులను జయింపఁగల విల్లమ్ములను సృజించి యీయఁగలను. నీ సేవయొనర్చుటకై మహావిద్వాంసుల నాకర్షించు మణిని సృజించి యిచ్చి అంతశ్శత్రువిజయము కల్గునట్లు చేయుందును' అనుచు ధనుర్బాణములను, మణిని వెంటనే సృజించి 'నీవు మరల పుట్టిన వెంటనే నేను వచ్చి వీని నిచ్చెద' ననెను.

ఇంతలో నచటికి శ్రీశైలమల్లికార్జునుని సేవింపవచ్చిన మదాళయుఁడును, అతని భార్యయు, పురోహితులు నీ మాటలు విని, 'ఇతఁడే స్వభావసిద్ధుఁ'డని తెలిసికొని నమస్కరించిరి. మదాళయుఁ డంత నిట్లనెను—"నేను హైహయవంశమున జనించిన మదాళయుఁడను. శత్రువిజయమును, సంతతిని గోరి నేను దత్తాత్రేయునింగూర్చి తపమొనర్పఁగా, ఆయన స్వప్నమునఁ గానవచ్చి 'నాశిష్యుఁడగు స్వభావసిద్ధునివలన నీకోరిక నెఱవేఱఁగల'దని చెప్పెను. మేము మిమ్ము వెదకుచు, శివరాత్రి యగుట నీ మల్లికార్జునస్వామిని సేవింపవచ్చి, అదృష్టవశమున మిమ్ముఁ గంటిమి. నా కోరికలు నెఱవేఱు వరము లీయఁ బ్రార్థించుచున్నా' ననెను.

స్వభావుఁడు తా సృజించిన విల్లమ్ములను, మణిని, మణికంధరునిఁ జూపుచు మదాళయునితో 'మరుజన్మమున నీతఁ డెల్ల శత్రువులను జయించుటకు వీనిని సృజించితిని. నీ వీతనిందక్క తక్కినవారి నందఱిని జయింపఁగల్గుదు' వనెను. అపుడు రాజు గర్వముతో 'అదే చాలు; ఇతనిసంగతిని నేఁ జూచుకొందు' ననెను. సిద్ధుఁడు దానికలిగి 'ఈ యస్త్రప్రభావమున నితఁడు నిన్ను తప్పక జయించును; అంతేకాక నీవు భార్యతోఁగూడ నీతని కూడిగము చేయుచుందువు' అనెను. అంత నతని పురోహితులు బ్రతిమాలుకొనఁగా 'నా వాక్యము జరిగి తీరును. మీ రాజీతనిందక్క తక్కినవారి నందఱను గెల్వఁగలఁడు. భార్యతోఁ గూడ నీతనిని సేవించునపుడు ఇతనిదగ్గఱి మణిని చూడఁగా సంతానము కల్గును. మీప్రభుని యేలికయే మీకును ఏలిక యగును ఆ మణిసంస్పర్శ

వశమున మీకు మహానందము కల్గును' అని పల్కి స్వభావుఁడు 'వారిని పంపి, మణికంధరుని వీడ్కొని నిశ్చేష్టుఁ జనెను.

## షష్ఠాశ్వాసము

ఆ పిదప అలఘువ్రతుఁడు మణికంధరుని తర్వాతి వృత్తాంత మడుగఁగా ఆ శిశు విట్లు చెప్పెను.

'మణికంధరుఁ డా విధముగా కొండచరియనుండి పడుటకు సిద్ధముగా నున్నపుడు భయపడి చెదరి పారిపోవు జనుల కోలాహలము వినవచ్చెను. వెంటనే యొక సౌందర్యవతి యగు యువతి మణికంధరుని సమీపించి యొక కత్తి నాతని కందిచ్చుచు 'ఓ గంధర్వకుమారా! శల్యాసురుఁ డను రాక్షసుఁ డిటు వచ్చి యాత్రికులపైఁ బడి వారిని చిందరవందర చేయుచున్నాఁడు. నీ వీ ఖడ్గముతో వానిని సంహరించి ప్రజలను కాపాడుము' అనునంతలో శిలల వర్షము కురిపించుచు శల్యాసురుఁడు రాఁగా మణికంధరుఁ డతనితోఁ డీకొనెను. కొంతసేపు యుద్ధమొనర్చి మణికంధరుఁడు వాని కంఠము త్రుంచెను; కాని ఏదుముండ్లు గాఢముగ నాటుకొన్నందునఁ దానును మరణించెను.'

ఇది విని యలఘువ్రతుఁడు 'బాలా! ఆ రాక్షసుఁ డెవఁడు? వాని నా రీతిని చంపించిన యా యువతి యెవ్వతె?' అని ప్రశ్నింపఁగా నా శిశు విట్లు చెప్పెను.

'శల్యాసురుఁడు మహిషాసురుని మేనమామకొడుకు. కాళికాదేవి మహిషాసురుని సంహరించినపిదప శల్యాసురుఁడు దేవిపై మిగులఁ గోపించి ఆమెగుడులను పడగొట్టుటకును, ఆమెభక్తులను చంపుటకును ఆలోచించి యయ్యు, శాంతమును నటించి యుండెను. ఒకప్పు డతఁ డొక వనములో అభినవకౌముది యను అప్సరసం జూచి తన్ను వరింపవలె నని నిర్బంధించెను. కాని ఆమె తిరస్కరించి 'నిన్నుచంపినవానిం గాని, నే నితరుని వివాహమాడ'నని ప్రతినచేసెను. ఆ

రాక్షసుఁ డామెపై మిగుల గోపించినను, ఎట్లయిన నామె పొందు పడయు వలె నను కోరికతో నెట్టి క్రూరకృత్యమునకును సిద్ధపడకుండెను. అదిమొదలు వానింజంపఁగలవానికొఱ కామెయుఁ, తన్నుఁ జంపఁబూనువానిం జంపుటకు శల్యాసురుఁడును యత్నించుచుండిరి. ఒకప్పుడు శల్యాసురుఁడు మృగేంద్ర వాహనగుడికి వచ్చి, అచటి స్తంభముపై నున్న వ్రాతను చూచి గండకత్తెరతో కంఠము నుత్తరించుకొని తన్నుఁ జంపువానిం జంపు వరమును పడసి, ఆ శక్తి గుడిని కూలఁద్రోయ సిద్ధపడెను. ఇంతలో నచటికి అభినవకౌముదియును వచ్చి, వానిం గాంచి మిగుల భీతిఁ జెందెను. శల్యాసురుఁడును తాను గండకత్తెరతోఁ దల నుత్తరించుకొని తన్నుఁ జంపఁబూనువానిని చంపు శక్తి నందినట్లును, ఆమెను వరించి తీరునట్లును అభినవకౌముదితోఁ బల్కెను. ఆమె గుడిలోని కేఁగి తన్నుఁ రక్షింపవలెనని దేవికాళ్లపైఁబడి ప్రార్థించెను. దేవి దయఁదలఁచి యామెకొక కత్తినొసఁగి 'ఇయ్యది మణికంధరుఁడను నొక గంధర్వుఁ డిక్కడ దాఁచియుంచి నది. అతఁడిప్పు డొక శాపకారణమున శ్రీశైలమున భృగుపాతమునకు సంసిద్ధుఁడై యున్నాఁడు. దీని నాతని కొసంగి యీ సంగతి తెలిపి ఆతనిచే నీ రక్కసుని చంపింపుము. వీనిని మంచిమాటలతో నీ వెనువెంట నచటికి రప్పింపుము. వీఁడు తన్నుఁ చంపువానిని చంపునట్లు వరము పొందెను; కాని యట్టివానిచే చంపఁబడనట్లు నియమము లేదు. మణికంధర, శల్యాసురులు పరస్పరము కొట్టుకొని మరణింతురు. మరుజన్మమున మణికంధరుఁడు కళాపూర్ణుఁడై పుట్టి, వెంటనే యుపకరుఁడగును. అపుడు నీవు నీ పూర్వవృత్తము వినిపించి దివంబునకుఁ జనక యావజ్జీవ మతనితో నుండుట కొడఁబడి యాతనిని వరింపుము' అని పలికెను. ఆమె యట్లే యొనరించి కళాపూర్ణమహారాజును వరించెను."

ఆ బాలిక యిట్లు మణికంధరుని వృత్తాంతముఁ దెల్పి మదాశయుఁడు సకలశత్రువులను జయించి గర్వితుఁడగుచు కాసారపురముమీఁదికి వచ్చి కళాపూర్ణునిచే ఓడింపఁబడి భార్యతోఁగూడ దాస్యమొనర్చుటయు, ఆ దంపతులకుఁ

దాను జనించుటయు, వారు క్రమకకంఠో త్తరపురంబు వెలువడి పోయి తిరిగి వచ్చి తన్నారాజునెదుట ఉంచుటయుఁ దెలిపెను.

పిదప నలఘువ్రతుఁడు ఆ పురోహితుల వృత్తాంతము నడుగఁగా నా బాలిక వార లాతనిపుత్రు లనుచు, అచ్చెరు వందిన యాతనితో నిట్లు పల్కెను.

'పాండ్యదేశమందలి యంరగపట్టణమున విద్వాంసుఁడును, ధనికుఁడు నగు సోమశర్మ యను బ్రాహ్మణుం డుండెను. యజ్ఞశర్మ అతని పుత్రుఁడు. ఎంత శ్రమపడినను యజ్ఞశర్మకు వేదాదివిద్య లబ్బలేదు. అందులకు విచారించు పుత్రుని విచారము పోఁగొట్ట సోమశర్మ దివ్యస్త్రీలనుబోలి యంత్రముఁరాం ద్రగు నల్గురు కన్యకలఁ దెచ్చి యతనికి వివాహముచేసి 'నీ వెప్పుడును మన నిరతాన్నదానవిధిని జరుపుచుండుము. దానివలన నీకుఁ జతురాగమసంతానము కలుగు'నని దీవించి యసువులఁ బాసెను. యజ్ఞశర్మ తన కెట్టి కష్టములు కలిగి నను లెక్కచేయక తన సర్వస్వము నశించినను అన్నదానవ్రతము నెఱవేర్చు చుండెను. ఇట్లు గొప్ప వ్రతము నెఱవేర్చుటచేతనే అతనికి 'అలఘువ్రతుఁ' డను ప్రసిద్ధి కల్గినది. అతఁ డిందులకై తన భార్యల నగలన్నే అమ్మివేసి తుదకు వారినిగూడ ధనార్థమై— వారికి తెలియకుండఁగనే ఒక వర్తకున కమ్మివేసెను. వారి నొక నెపముమీఁద తామ్రపర్ణి రేవున పడవ నెక్కించి పడవ తోంచెను. దూర మేఁగఁగా బావురు మని యేడ్చెను—'వర్తకుఁడు తమ భర్తను మోస గించి తీసికొని పోవుచున్నాఁ'డని తలఁచి యా నల్గురు పడఁతులును సము ద్రములోని కురికిరి. వర్తకుఁ డెంత వెదకించినను లాభము లేకపోయెను. 'నీయేడ్పువలననే యింత మూఁడిన' దని పల్కుచు వర్తకుఁడు బ్రాహ్మణుని నిందించి తా నిచ్చిన ధనమును దీసికొనెను.

నీటిలోఁ బడిన యా యువతుల నొక గొప్ప చేప నీటితోఁగూడ లోనికిఁ బీల్చివేసెను. మరల నీటిని పైకి విడుచునపుడు ఆ నల్వురును నీటితోఁ గూడ పై కెగిరి ఆ సమయమున ఆకసముపై పోవుచున్న యొక విమా

నముపైఁ బడిరి. ఆ విమానమున నున్న దివ్యదంపతులు వీరి కుపచరించి వీరి వృత్తాంతము తెలిసికొని గోదావరీనదీతీరమునఁ గల 'ధర్మపురి' యందలి యొక్క వారవనితమేడపై వారిని దించిరి. దివ్యయువతి 'వీరివలన జారభావము కోరు వాఁడు నాచే దప్పక కష్టముపొందు'నని యుఁ జెప్పెను. ఈమాటలు చాటున నుండి వినుచున్న యా యింటియజమానురాలు వీరు దేవతాస్త్రీ లనియే భావించి సమస్తసంపదలతో వెలయుచున్న ఆ యింటిని వారి కప్పగించి తా • నెందేని పోయెను. ఎట్టి కష్టములు లేక ఆ యువతులు కొంతకాల మచ్చటనే యుండి తమ భర్తంగూర్చి తెలిసికొన యత్నించుచుండిరి. వా రదివఱకే గర్భవతు లగుటచే నెలలు నిండఁగా నల్గురు పుత్రులు కల్గిరి. ఒక తపస్వి వారలకు జాత కర్మాదు లొనర్చి క్రమముగా ప్రథమాగమ, ద్వితీయాగమ, తృతీయాగమ, తురీయాగము లని నామకరణ మొనర్చి, వారు పెరిగి పెద్దవారు కాఁగా ఉప నయన, విద్యాభ్యాసము లొనరించి గొప్ప సకలశాస్త్రవేత్తలుగా నొనరించెను. పిదప వారు తా మొకరాజాశ్రయము సంపాదించువఱకును తమ తల్లులనందే 'దేవతావనిత'లను గుట్టు బయలుపడకుండ నుండఁగోరి, నగరములో తిరిగి యాపురము నేలు 'మదాశయుఁ'డను రాజు గొప్పవిద్వాంసుఁ డనియు, అతని పురోహితు లితరులగు విద్వాంసులకు రాజదర్శనమును లభింపఁజేయ రనియుఁ దెలిసికొని మాఱువేసముల రాజును దర్శించి, తమ ప్రతిభను వెల్లడించి యాతని మన్ననల నందిరి. రాజు తనపురోహితుల దౌర్జన్యము తెలిసికొని వారిని తప్పించి ప్రథమాగమాదులనే తన పురోహితులుగా నియమించెను. పిదప వారు తల్లి యాజ్ఞననుసరించి వివాహితులై యా రాజుచే సకలధర్మకర్మము లొనరించు చుండిరి.

అలఘువ్రతుఁడును యాయావరవృత్తిని ధనార్జనముచేయుచు, అన్న దానవ్రతమును కొనసాగించుచు తుదకు మృగేంద్రవాహనమహిమల నెఱింగి యచటికిఁబోయి కళాపూర్ణకథాశ్రవణమువలనఁ గల్గుఫలములఁ దెలిసికొని—

పుత్రపౌత్రాభివృద్ధిసంగతి యటుండ తక్కిన ఫలంబులైనను సిద్ధించునుగదా యని తపంబొనర్చి - తుదకు పుత్రసంపదంగూడ బొందఁగలిగెను.'

అంతఁ గళాపూర్ణుఁడు మదాశయదంపతులను మిగుల గౌరవించెను. వారికి దాస్యమును తొలఁగించెను. ఈ వృత్తాంతము లేవియు నంతిపురమున అభినవకౌముదికి తెలియకుండ ఏర్పాటుచేసెను. ప్రథమాగమాదులు తంద్రికి నమస్కరించి మిగుల గౌరవించిరి.

అంత సత్వదాత్ముఁడు ఆ బాలికం జూచి 'అమ్మా! నేను నా కులమును పేరిని ఏకారణముననో మఱచిపోయితిని. ఒకపుడు కాసారపురవాసులు నన్ను రాజుగాఁ జేసి సత్వదాత్ముఁ డని పేరిడిరి. నా వృత్తాంత మేమో వివరింపుము' అని ప్రశ్నింపఁగా నా బాల సామాన్యశిశువువలె నిటునటు పొరలి యేఁకట నేడ్వసాగెను. ఎవ రెన్నివిధముల నడిగినను లాభము లేకపోయెను. పిదప కళాపూర్ణుఁ డా శిశువు నింటికిఁ దీసికొనిపోయి సంరక్షింప మదాశయదంపతులఁ గోరి వారిని గౌరవముతోఁ జూడసాగెను. మధురలాలసయుఁ బెరిఁగి పెద్దదై సమస్తకళలు నేర్చి తన్ను కళాపూర్ణుఁ డెప్పుడు వరియించునో యని విరహావ్యథఁ గుందుచుండెను.

## సప్తమాశ్వాసము

కళాపూర్ణుఁ డొకనాఁడు మదాశయుని భవనమువంక నేఁగుచు లోకోత్తరసౌందర్యవతి యగు మధురలాలస నుద్యానవనమునఁ గాంచి మోహపరవశుఁడయ్యెను. పసిపాపగా నున్నపుడుమాత్ర మామెను కొలఁదిసేపు చూచుటచే నామెను పోల్పఁజాలక యామెవృత్తాంతమును తన నర్మసఖుఁడగు వృద్ధబ్రాహ్మణునిమూలమునఁ దెలిసికొని, సత్వదాత్మునిఁ గన్యావరణార్థము మదాశయునివద్దకుఁ గఁబురంపి, యతని యనుమతినిఁ బడసెను. అభినవకౌముదియుం మనశ్శూర్తిగ నీ వివాహమునకు సమ్మతించెను. పిదప కళాపూర్ణునకు మధురలాల

సతో వివాహమయ్యెను. కళాపూర్ణుఁడు అభినవకౌముదీ మధురలాలసలను సమానముగాఁ బ్రేమించుచు సుఖించుచుండెను. ఆతని రాణు లిర్వురును అప్సరస్త్రీలవలెనే మెలఁగుచుండిరి.

ఒకనాఁడు కళాపూర్ణుఁడు అభినవకౌముదియంతిపురమున నుండి ఆమె వీణ వాయించుచుండ నానందించుచు మధురలాలస నచటికి రప్పించెను. అభినవకౌముది వాయించు వీణ నామె కిప్పించి మీటుచుఁ బాడఁగోరఁగా - 'ఈవీణ శ్రుతికి నా కంఠస్వరము సరిపడ'దని జంత్రసహాయము లేకయే పాడి భర్తను అభినవకౌముదిని ఆశ్చర్యమున ముంచెను. మఱియుం ఈ వీణను మించిన వీణ వేఱొకటి లేదని యభినవకౌముది పల్కఁగా కళాపూర్ణుఁడు పూర్వజన్మ వృత్తాంతము స్మృతిపథమునకు రాఁగా మహేంద్రవాహనగుడియుండి తన వీణను తెప్పించి మధురలాలస కొసంగ సంకల్పించెను. ఈసంగతి చెలికత్తెల వలనఁ దెలిసికొని యభినవకౌముది యా వీణ తనకే కావలె నని పట్టుపట్టఁగా కళాపూర్ణుఁ డట్లే యని యొప్పుకొని సకలరాజసీమంతినీ మౌళిమణులు తెచ్చి కాలి యందియలఁ బొదిగింతు నని మధురలాలసను తృప్తిపఱచి ఏతత్కార్య ద్వయమునకై దండయాత్రయే శరణ్యమని సత్వదాత్మునితోఁ గలసి యాలోచించి నిశ్చయించెను.

## అష్టమాశ్వాసము

పిదప సత్వదాత్ముఁడు ప్రభునియాశయమును వివరించుచుఁ బత్రికలు పంపఁగా చాలమంది నృపాలురు తమ దేవేరుల మకుటమాణిక్యములను సమర్పించి శరణుఁజొచ్చిరి. ఎదిరించిన గౌడ, ఉత్కళదేశాధిపతుల నోడించి, ద్రావిడ, చోళరాజులను వశపఱచుకొని కళాపూర్ణుఁడు కేరళాధిపతి యెదిరింపఁగా నతని నోడించి, అతనిమూలమున మృగేంద్రవాహనగుడి యున్న చోటు తెలిసికొని అచటి కేఁగి క్రిందటి జన్మమున దాచియుంచిన వీణ

చక్కడినుండి చేకొని ఘూర్జరాదిదేశముల లోఁబఱచుకొనుచు స్వదేశమునకు మఱలి వచ్చి యావీణ నభినవకౌముది కొసంగి, వివిధరాజన్యసీమంతినీమౌళి మాణిక్యములతో మధురలాలస కందెలు తయారుచేయింప సత్వదాత్ముని నియోగించెను.

మధురలాలస దానితోఁగూడ మిగిలిన నగలను ధరియించు సమయంబునఁ జెలికత్తెలు ప్రసంగవశమునఁ దన చిన్ననాఁడు కళాపూర్ణుండొసంగిన మణిహారముఁగూర్చి తెల్పఁగా, ఆమె దానిని తెప్పించి ఆ మణి సరిగా హృదయముపైకి వేలాడు రీతి నిటునటు కొన్ని మాణిక్యములు గ్రుచ్చి ధరించెను. అంత సత్వదాత్ముఁ డందెలను దెచ్చి యామెకు నమస్కరింప వారించి 'నీవు నాకుఁ మేనమామవు. మా యమ్మ రూపానుభూతి నీయక్క' అని యాతనికి నమస్కరించెను. అపుడు కళాపూర్ణుఁడు శైశవమున ఆమె చెప్పిన యద్భుత వృత్తాంతములు జ్ఞప్తికి రాఁగా 'ఈమె చెప్పిన సంగతి యథార్థమే కావలె' నని సత్వదాత్ముని వృత్తాంతము తెల్పఁగోరఁగా మధురలాలస యిట్లు చెప్పఁ దొడఁగెను.

"ఇతఁడు తొలుత మహారాష్ట్రమును పాలించు సుగ్రహుఁడను రాజు. మాతల్లి యీతనియక్క. ఈతఁ డుత్తమకులీనుఁడని పెక్కుమంది రాజులు తమ తమ పుత్రికల నీతని కిచ్చి వివాహమొనర్పఁ దలంచిరి. కాని అందఱిని తృప్తి పఱుప నవకాశము లేమిచే ఎవ్వరికిని సమాధాన మీయఁడయ్యెను. అది యవమానముగా భావించి, వారందఱు నొక్కుమ్మడిని ఇతనిపయి దండయాత్ర వెడలిరి. ఎట్లయినను వారి నందఱిని పరాభూతులఁ జేయుం దలఁపున నీతఁడు నగరము విడిచి పోయెను. రాజు లేని రాజ్యము నాక్రమింప నిష్టపడక శత్రురాజు లందఱును వెనుదిరిగిపోయిరి. ఈ సంగతిని సుగ్రహుఁ డెఱుఁగఁడు. తన రాజ్యముసంగతి, శత్రువులసంగతి ఉన్నచోట నుండియే తెలిసికొనిన ఎంత మేలుగా నుండునో యను నూహ యాతనికిఁ జనించి, యున్నచోట నుండియే

సకలవృత్తాంతముల యెఱుకకయి యమునాతీరమున శ్రీకృష్ణునిగూర్చి ఘోర తపం బొనరించెను. శ్రీకృష్ణుఁడును ప్రత్యక్షమై యొక మణిహారము నొసఁగుచు — అందలి మధ్యమణి ఎవ్వరి హృదయస్థలమున నెంత తడవు సోకియుండునో, వారి కంతతడవును సర్వజ్ఞత్వమును, సకలవాక్పటుత్వంబును కలిగి యుండును; బ్రాహ్మణులకు మనోవ్యథ కావించువారి యొద్ద నిది యుండదు' అని చెప్పెను. ఇతఁ డా హారమును తీసికొని యడవిలో నొక్క దేవాలయమున ద్వారపార్శ్వమున నున్న ఒకయువతిప్రతిమం గాంచి, దాని శిల్పసౌందర్యమున కచ్చెరువందెను. అప్పు డొక సన్న్యాసియు నచటికి వచ్చి యా విగ్రహపు సౌందర్యమునకు ముగ్ధుఁడై తమకము పట్టలేక దానిని కౌఁగిలించుకొనెను. సుగ్రహుఁడు తన చేష్టం గాంచుచున్నట్లు ఆ యోగి యెఱుంగఁడు. పిదప నీతనిం జూచి సుగ్రహుఁడు నవ్వెను. సన్న్యాసి దానిని లెక్కచేయక తన్ను మానింపకుండుటకై యా దేవాలయమునందలి విగ్రహముల నన్నింటిని కౌఁగిలించుకొని, ప్రదక్షిణనమస్కారము లొనరింపసాగెను. సుగ్రహుఁడు దీనిని గమనించుచున్నందున 'నీ వెట్లు నటించినను నీ సంగతిని నేఁ గనిపెట్టకపోలేదు లెమ్ము' అని యాతనితోఁ బల్కెను. దాని కా యోగి కోపించి 'నీ వింతవఱకును తెలిసికొనిన సంగతి నంతటిని మఱచిపోవుదువుగాక' అని శపించెను. పిదప అతఁడు ప్రార్థింపఁగా 'ఈ నా సంగతి బయలుపడినప్పుడు శాపవిముక్తి యగు!' నని యనుగ్రహించెను. ఈ శాపమువలన సుగ్రహుఁడు తాను భద్రముగా నుంచిన మణిమాలను, తన కులగోత్రనామములను మఱచిపోయెను. అతఁడు కాసారపురమునకు రాఁగా, ప్రజ లాతనిని రాజుగా నొనరించి సత్త్వదాత్ముఁ డని పేరు పెట్టిరి. తత్స్వరూపమున తమకు ఒక సత్త్వము దయించుట చేతనే వా రాతని కా పేరు పెట్టిరి. అతఁడు కాసారపురంబు పాలించుచు సుముఖాసక్తిమణిస్తంభులను సేవించుటయుఁ బదపడి నీ కమాత్యుఁ డగుటయుఁ బిదప వంగదేశమున క్రముకకంఠోత్తరపురమున నిన్ను నిలిపి సేవించుటయును తెల్లములే గదా!"

ఇట్లాతని వృత్తాంతమును జెప్పి మఱియు నిట్లనెను - 'నే వప్పు డీతని వృత్తాంతమును తెలుపకుండుటకును, ఇప్పుడు తెలుపుటకును కారణము కలదు. ఆ మణిమాల చిన్న దగుటచే దాని నాయకమణి నా పసితనమున హృదయమధ్యమును సోకుటచే సర్వవిషయములను చెప్పఁగలిగితిని. ఇటువటు పోర్లుటచే అది స్థానమును తప్పినందున మఱి చెప్పలేకపోతిని. నేడు ఆ నాయకమణి హృదయమధ్యమును సోకునట్లు మాలికను తయారుచేసి ధరించుటచే నిపుడు చెప్పఁగలిగితిని.

ఈ మణిహారము నట్లు సుగ్రహుండు మఱచి, విడిచిపోఁగా మధురాపురనివాసి యగు బ్రాహ్మణుం డొకఁడు గ్రహించి శ్రీకృష్ణునకే సమర్పించెను. క్రిందటి జన్మమున నీవు మణికంధరరూపమున నుండి అద్భుతదండకము చెప్పి యీమణిహారమును బహుమానముగాఁ బడసితివి. దానిని ధరించినను - నాయక మణి హృదయమధ్యమును సోకకుండుటచే ఏ సంగతియుఁ దెలియలేదు. మణి కంధరుఁడు భృగుపాతమునకు మున్ను ఈ హారము నలఘువ్రతున కీయఁగా, ఆతఁడు నీకు సమర్పించెను. నీవలన నా కియ్యది లభ్యమైనది.'

సత్వదాత్ముఁడు తన వృత్తాంతము నంతను దెలిసికొని మిగుల సంత సించి, తన మహారాష్ట్రరాజ్యాధిపత్యముకంటె నిట నుండుటయే పెక్కువిధ ముల నానందదాయక మని కళాపూర్ణునే సేవించుచుండెను.

ఒకనాఁడు కళాపూర్ణుఁడు మధురలాలసతో నిష్టగోష్ఠి నుండి మణి మాలికాప్రశంసాప్రసంగమున విష్ణుదేవుని మాహాత్మ్యము తలఁపునఁ బొడ మఁగా తదీయకీర్తన మిహపరసాధన మని భావించి, తాను చిన్నపుడు భగవం తునింగూర్చి వ్రాసిన రచనలోని విశేషములను జెప్పవలయునని మధురలాలసను కోరెను. ఆమెయుం నందలి లక్ష్మీనారాయణసంవాదకథ నిట్లని చెప్పఁ దొడంగెను.

'బ్రహ్మాండజాలమున కావల విష్ణులోకము కలదు. అచట సమృద్ధ గుణములే గాని, ప్రకృతిక్షోభము లణుమాత్రము ఉండవు. అచట అరము, అరణ్యము నను రెం డమృతశరధులు కలవు. విరజానదియుం, నొక సరస్సును. దానిచేరువ దివ్యాశ్వత్థవృక్షములును గలవు. అచట నచ్చరలు ముక్తులతోఁ గూడ వినోదించుచుందురు. ఉద్యానవాటికలతోఁ గూడి యచటి రాజధాని వైకుంఠపురము మిగుల శోభిల్లుచుండును. ఆ నగరమధ్యమునఁ గల రాజసౌధములో శ్రీభూనీళలు సేవింపఁగా విష్ణువు మాణిక్యసింహాసనమున వెలయుచుండును. నిత్యముక్తులెల్లపుడు నితనిని సేవించుచుందురు.

ఒకప్పుడు లక్ష్మీదేవి ప్రసంగవశమున పరాత్పరునితో 'ఓ దేవా! జగదుత్పత్తిస్థితిలయములకు నీవే కారణమవు. బ్రహ్మ, మహేశ్వరులు నీ దయకుఁ బాత్రులై తమ కృత్యములను నెఱవేర్చుచుందురు. భోగమువలన మోక్షము లభింపనందున ఆ మోక్షప్రాప్తికై జ్ఞానప్రదములగు వేదశాస్త్రములను సృజింపఁజేసితివి. వానినభ్యసింప శక్తి లేనివారికొఱకు రామ, కృష్ణాద్యవతారములెత్తి జనులను తరింపఁజేయుచుందువు. ఇట్లందఱిని సమానముగఁ జూచుచుండియుఁ గొందఱిని భవబంధులఁ జేయుటకును, కొందఱి భవమును తొలఁగించుటకును కారణ మేమో తెలియకున్నది. నా ప్రార్థన మాలించి నిష్పక్షపాతముగ నందఱికిని ముక్తి నొసంగవలె' నని వేఁడఁగా భగవంతుఁడు 'లోకమునఁ దల్లికిఁ దండ్రికంటె సంతానముపై నెక్కువ ప్రేమ యుండుట సహజమే! కావున నీ విట్లు పల్కుచున్నావు. నే నందఱిని సమానముగనే చూచుచున్నను వారివారి పూర్వజన్మకర్మల ననుసరించి జనులు ముక్తిని, సంసారబంధమును బొందుచుందురు. విజ్ఞులకే కాక యజ్ఞులకయి మోక్షప్రదములగు శ్రీరంగాది క్షేత్రములందు మత్పూజనాది సౌకర్యము లేర్పఱిచియే యుంటిని. ఆ క్షేత్రములకు వెళ్లఁజాలనివారు భవబంధమునఁ బడుచున్నారు. కాని యిప్పుడు నీ ప్రార్థన మాలించి - అట్టి క్షేత్రముల కేఁగ

తున్నను - ఉన్న చోటనే యుండి నన్ను ధ్యానించినను మోక్షము కలుగునట్లు వర మొసఁగుచున్నాను' అని వివరించి వర మొసంగెను. లక్ష్మీదేవి మిగుల సంతసించెను. ఇదియే మీరు మణికంధరుఁడుగా నున్నప్పుడు భగవంతునిగూర్చి చెప్పిన లక్ష్మీనారాయణ సంవాదమునందలి విషయము.

ఈ విషయమును విని కళాపూర్ణుఁడు మిగుల సంతసించెను. అతఁడు సదా భగవంతుని ధ్యానించుచు, ధర్మమార్గంబున రాజ్యము పాలించుచుండెను. అతనికి అభినవకౌముదియందు సుప్రసాదుఁడును, మధురలాలసయందు సరసుఁడనియుం పుత్రులు కలిగిరి. ఇట్లతఁడు సిరిసంపదలతోఁ దులతూఁగుచు చిరకాలము రాజ్యము పాలించుచుండెను.

---

## నిఘంటువులు

| | | | |
|---|---|---|---|
| వావిళ్ల నిఘంటువు (అ-ఔ వఱకు) I సంపుటము | ... | 10 | 0 |
| డిటో (క-ఙ వఱకు) II | ... | 12 | 0 |
| డిటో (ట-న) III | ... | 10 | 0 |
| డిటో (ప-క్ష) IV | ... | అచ్చగుచున్నది | |
| శ్రీవేంకటేశాంధ్రము, పద్యకావ్యము | ... | 0 | 37 |
| బాలచంద్రోదయము, అలఘుకౌముది | ... | 1 | 0 |
| షడ్భాషామంజరి, (ఆరుభాషల వొకేబ్యులరి) | ... | 2 | 0 |
| శబ్దార్థచంద్రిక, శ్రీమహాకాళి సుబ్బారాయకృత ఆంధ్రనిఘంటువు | | 10 | 0 |
| Sankaranarayana's English-Telugu Dictionary, శ్రీ శంకరనారాయణగారి నిఘంటువు, (ఇంగ్లీషు పదములకు తెనుగు అర్థముగలది) | ... | 15 | 0 |
| Sankaranarayana's Telugu-English Dictionary, ,, (తెనుగు పదములకు ఇంగ్లీషు అర్థముగలది) | ... | 12 | 0 |
| English-Telugu Pocket Dictionary ఇంగ్లీషు - తెనుగు పాకెట్టుడిక్షనరి | ... | 5 | 0 |
| Translation Guide [English to Telugu & vice versa] useful for Revenue officials | | అచ్చు | |
| సంస్కృతాంధ్రనిఘంటువు (సంస్కృతపదములకు తెనుగు అర్థముగలది) | | 5 | 0 |
| డిటో ద్రావిడ అర్థములతో | ... | 4 | 0 |
| త్రికాండశేషము, సటీక | ... | 1 | 75 |
| విశ్వకోశము, (విశ్వనిఘంటువు) సటీక | ... | అచ్చు | |
| మేదినీకోశము ,, | ... | 4 | 0 |

☞ ఇవిగాక అనేక సంస్కృతాంధ్రగ్రంథములు, నాగరిలిపి గ్రంథములు, వచనగ్రంథములు, ఇంగ్లీషుగ్రంథములు మావద్ద దొరకును.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు,
పోస్టుబాక్సు 1372, మద్రాసు. 1.